బ్రహ్మశ్రీ మన్నెంపల్లి రామకరామశర్మగారి

# భక్తి శతక పద్య మధుర మందార మకరందాలు

కృతికర్త : **బ్రహ్మశ్రీ మన్నెంపల్లి రామకరామశర్మ**

మన్నెంపల్లి, మం॥ తిమ్మాపూర్,

జి॥ కరీంనగరం, రా॥ తెలంగాణ

## శ్రీ రామచంద్ర పరబ్రహ్మణే నమ:

కం॥ శ్రీరామభవ విరామా!
శ్రీరామా సార్వభౌమ । శ్రీకర రామా!
శ్రీరామా శ్రితధామా!
శ్రీరామ మనోభిరామ! । సీతారామా॥ (1)

కం॥ శ్రీమద్వాల్మీ కంబగు
రామాయణ పఠనజేసి । రాముని దయతో
రామశకంబు జెప్పెద
రాముడె బలికించె నాత్మ । రంజిల రామా॥ (2)

కం॥ ఆత్మా రాముడవును బర
మాత్మా రూపుడవు నీవె । యఖిలము నీవే!
యాత్మేతర వస్తువులే
దాత్మయె సర్వంబు నిండు । నాత్మయె రామా॥ (3)

కం॥ ధనమును విద్యయు గీర్తియు
నిను గోరగలేదు రామ । నిమిష నిమిషమున్
నిను విడువలేను గావున
నినుమరువని మనమునాకు । నిలుపుము రామా॥ (4)

కం॥ కనులన్మూసిన దెరచిన
గనుపించుము రామనాకు । కరుణా సింధో:
ఘనకోమల రూపంబును
గనులకు పండుగయెగాగ । గాంచెద రామా ॥ (5)

కం॥ ఆలస్యము జేయకుమా
కాలముగతి దెలియరాదు । గావున రామా!
లీలా మానుష రూపమ
నాలో వెలుగంగ దర్శ । నమ్మిడు రామా! ॥ (6)

కం॥ నారద మూర్తిగ కలలో
తారక మిచ్చితివినాకు । తరియించు టకున్
తారకముం జపియించితి
గారుణ్యము మీఱ వచ్చి । కనపడు రామా ! ॥ (7)

కం॥ నీవలె దయగల సద్గురు
నీవలెను పరోపకారి । నిన్ గనజాలన్
నీవే నీకిల సాటియు
నీవే నారాయణుడవు । నిజముగ రామా! ॥ (8)

కం॥ బుద్ధికి లోపల నుంటివి
బుద్ధికి వెలుపలనునీవె । బుద్ధ్యధి పతివై
బుద్ధీంద్రియములను నడుపు । బుధనుత రామా! ॥ (9)

కం॥ ఇంద్రియములకును వెలుపల
ఇంద్రియములోన నీవె । యీశుడవగు,నా
ఇంద్రియముల నడిపించిన
ఇంద్రియములె దెలియలేవు । యినకుల రామా ! ॥ (10)

కం॥ బుద్ధికృంబగు కర్మకు
బద్ధుండయి నావియనిన । వగవున జిక్కున్
బుద్ధిని నే గానననియా
బుద్ధికి సాక్షివి యటన్న । ముక్తుడె రామా ! ॥ (11)

కం॥ సంతోషమె యానందము
సంతోషమె సుఖమునిచ్చు । సర్వ జనులకున్
సంతోషము గావలెనన
సంతతమును రామనామ । స్మరణమె రామా ! ॥ (12)

కం॥ నీ పాదములే గతియని
నీ పాదము లాశ్రయించి । నే గొల్చితి నిన్
కాపాడునన్ను దయతో
పాపంబుల బాపి యొసగు । భక్తిని రామా ! ॥ (13)

కం॥ రామా యెప్పుడు నీదగు
నామము జపియించు నట్లు । నను దయగనుమా!
కామాదు లేమి గోరను
యీ మాత్రము నీయ బరువె । యినకుల రామా ! ॥ (14)

కం॥ నా మానస సంచలనము
రామా! భరియించ లేను । రా, శరణంటిన్
నామాన సమర్పించితి
నేమాత్రము విడువకయ్య । నిమ్మిగ రామా! ॥ (15)

కం॥ రామా నీవలె నెవ్వరు
యేమడిగిన నిచ్చువార । లెందున గలరే
కామము మోక్షము నిత్తువు
రామా! నీకెవరుసాటి । రారిల రామా! ॥ (16)

కం॥ నీవే దయగల వాడవు
నీవే నాకిమ్ము నాత్మ । నిశ్చయ బుద్ధిన్
నీవే సర్వము రామా!
రావే సాక్షాత్కరింప । రయమున రామా! ॥ (17)

కం॥ ఊఆక వేడెదు నాకో
తీఅక లేదనుచు నీవు । తీవ్ర పడకుమా
యాఅడిని దీర్పు రామా!
వేఱెవ్వరు వెతల బాపు । విబుధులు రామా! ॥ (18)

కం॥ రామా ! నను మరువకుమా !
రామా నిను విడువ విడువ । రాత్రింబవలున్
నా మనమున నిను దలతును
రామా దయజూడు నన్ను । రఘుకుల రామా ! ॥ (19)

కం॥ మఱువకు మఱువకు మనియిటు
మొఱలిడనిను విడిచియెటకు । బోయితిననుచున్
గొఱజూడకు, కరివరదా !
మఱపును రాకుండ జేసి । మనుపుము రామా ! ॥ (20)

కం॥ శరణని వేడితి రామా !
శరణాగత రక్షణంబు । సలుపుము రామా !
మరణంపు వేళలందున
కరుణించియు నీవునాకు । గనబడు రామా ! ॥ (21)

కం॥ కోదండ రామ యనుచును
నీ దండను జేరి పిలువ ! నీదయ రాదా !
మోదంబున మాటాడుము
ఖేదంబు నడంప జేయు । కృపతో రామా ! ॥ (22)

కం॥ సీతారామా యని నే
బ్రీతిన్నిను బిలువ బలుక । బిడియమ రామా !
భీతి గలిగి మాటాడవొ
వేతనమే నడుగ నయ్య । వెలయగ రామా ! ॥ (23)

కం॥ హంసకుల మండనా యని
హంసాత్మక యనుచు నిన్ను । నార్తిని బిలువన్
సంసార కూప మందున
హింసల పాల్జేయ దగునె ? । యిటునను రామా ! ॥ (24)

కం॥ రామాయని నే బిలిచిన
నేమాత్రము బలుక వైతి । వేమి దయాళూ!
స్వామీ నా తప్పేమో !
నామీదను కినుక మాన । న్యాయమె రామా ! ॥ (25)

కం॥ దశరథ రామా యనినిను
దశదిశలును మ్రోయ బిలువ,। దయరాదే ! నీ,
వశమే కాదా యోయన

కం॥ కఠినము సేయకు రామా !
కఠినపు బలుకన్న నీకు । కష్టము గాదే!
కఠినుడవు గావు గద మఱి
కఠినుండను పేరు నీకు । గానిది రామా ! ॥ (27)

కం॥ అందరు నీవలె బిలిచిన
నెందఱికో దాల్మిమీఱ । యేమనవలె,నా
కందరు నొక్కటి యని,నీ
వుందువొ మౌనముననొకట । యోగిగ రామా ! ॥ (28)

కం॥ ఏమని బిలువగ వలెనో
యేమని బిలిచినను నీకు । నిష్టం బగునో
నీ మధుర వచనములు విని
ప్రేమను నిన్ బిలుతు నెపుడు । శ్రీ రఘురామా ! ॥ (29)

కం॥ ఆదియు మధ్య మనంతము
లేదుసదా నీకుదలప । లేవంగము, లే
దేదేదీ సూత్రము గోత్రము
యేదన రానట్టి సత్వ। మీవో రామా ! ॥ (30)

కం॥ ఆకారము సెప్పగ రా
దాకారమె లేదు నీకు । నదియెట్లన్నన్
యాకారమె జగమంతయు
నాకారములోని జ్ఞాన । మాత్మయె రామా! ॥ (31)

కం॥ నాహృదయ కమలమున,సం
దేహము లేకుండ నుండు । దీనదయాళూ!
సోహమను జ్ఞానమొసగియు
మోహము దగబాపియిమ్ము । ముక్తినిరామా! ॥ (32)

కం॥ శ్రీరామా! యని బిలిచిన
శ్రీరామా! మాటలాడ । సిగ్గు గలిగెనా!
శ్రీరామా! జానకి, నా
శ్రీరామా! సీతనైన । సిగ్గా? రామా! ॥ (33)

కం॥ నీదయ రాదా రామా!
నీదయరాకున్న గడియనే । యుగమందున్
నీదయగలిగిన యుగమునె
నీదయతో నిముసముగను । నెఱపుదు రామా! ॥ (34)

కం॥ భద్రమ్ముగ సర్వమ్మున
సద్రూపుడవై వెలుంగు । స్వామివి నీవో
చిద్రూపా నా హృదయము
త్వద్రూపము నిలుప గోరె, । దశరథ రామా! ॥ (35)

కం॥ శ్రీరామా! నిను వేడితి
సారము లేనట్టి ఘోర । సంసా రాబ్ధిన్
దారినొసగి దాటించుము
భారము నీదయ్య గావ । దశరథ రామా! ॥ (36)

కం॥ రామా! మదిసెజ్జ పయిన్
రామా! పవళించవయ్య । రాగమొలుక, శ్రీ
రామా! రమతో సతతము
రామా, నామీద నెనరు । రావలె రామా! ॥ (37)

కం॥ మేల్కొను దశరథ రామా!
మేల్కొనుమో సుగుణధామ । మేఘశ్యామా!
మేల్కొనెను సర్వమేదిని
మేల్కొల్పుము హృదయములను । మేలగు రామా! ॥ (38)

కం॥ నీవే నాలోనుంటివి,
నీవే సాక్షాత్కరించు । నీదయ చేతన్
నీవే గతియని నమ్మితి
నీవేగద దిక్కునాకు । నిరతము రామా! ॥ (39)

కం॥ శబరివలె ఫలము లిచ్చిన
యబలలతో గాని మాట । లాడవ యేమో
శబరిగనో యబలగనో
సొబగున జన్మించనైతి । సుందర రామా! ॥ (40)

కం॥ వేదమయని నిను గన్గొన
వేదములే వెదకి వెదకి । వేసారెనయా!
వేదములె దెలియనేరని
వేదాత్ము నెఱుంగవశమె । వెట్టికి రామా! ॥ (41)

కం॥ తత్వము మాకు దెలియునని
తత్వజ్ఞులు హుంకరించి । తడబడుదు రిలన్
తత్వము బ్రహ్మపదంబగు
తత్వము దెలుపంగ నీవె । తగుదువు రామా! ॥ (42)

కం॥ ధృవునివలె పదవి నడుగను
భవజలధిని గడుపుకొఱకు । భక్తి నొసగుమా!
చివరకు మరణ సమయమున
తవపద జలముల జూపు । దయతో రామా! ॥ (43)

కం॥ భక్తులలో ప్రహ్లాదుడు
ముక్తులలో పక్షిరాజు । ముజ్జగములలో
భక్తులు ముక్తులనేకులు
ముక్తులలో నన్నుజేర్చు । మునినుత రామా! ॥ (44)

కం॥ రూపము, నామమ, జగమని
రూపము నామమున జూడ । రూఢి యెఱుగ నా
రూపము నామములో, నీ
రూపము గలదనెడి తెలివి । రూపము రామా! ॥ (45)

కం॥ రామా నీవే వెలిసితి
నామము రూపంబులను । మనంబగు జగతిన్
నీ మాయా విలసనమిది
మే మెరుగుట నెట్లు దెలుపు మీదయ రామా! ॥ (46)

కం॥ రామా! వినుచున్నావా?
రామా! పిలుచునది నిన్నె । రాననకు సుమా!
రామా! జానకి జేకొని
రామా! రా! నిన్ను విడువ । రా! శ్రీరామా! ॥ (47)

కం॥ నను నమ్మిన వారిని, నే
నును యోగక్షేమములు గ । నుంగొనుచును,వా
రిని నేలుచుంటి నినున
మ్మిన వాడను, కావుమయ్య । మెలకువ రామా! ॥ (48)

కం॥ ఎప్పుడు నన్నెటు దలచిన
తప్పక ఘన మోహ మాయ । దాటింతునటం
చొప్పుగ జెప్పితి గీతను
యిప్పుడు తరియుంప జేయ । వే! శ్రీరామా! ॥ (49)

కం॥ మాటాడ నను నాతో
మాటాడెడు వానికింత । మౌనమ రామా!
మాటాడితి వెందరితో
మాటాడగ రావె యొక్క । మాటున రామా! (50)

కం॥ నీమాయా నాటకమును
యేమాత్రం బెఱుగరాదు । యెవరికి నేనిన్
రామా యేమి విచిత్రము
యీమాయ దరింప శక్తి । నీవే! రామా! ॥ (51)

కం॥ మాటాడు మనుచు గోరగ
మాటాడగ లాభమేమి । మాకని యనెదో
మాటాడు రామ నాతో
మాటాడిన మరణ భయము । మానును రామా! ॥ (52)

కం॥ మరిపింపకు నీ నామము:
మరిపించిన పిదప నీవె । మన్నింపవలెన్
మురిపించకు మాళలచే
మురిపించుము భక్తి గలిగి । మురియగ రామా! ॥ (53)

కం॥ నీకును నామము సఖ్యము
నీకును ననువిడువుమన్న । నిముషమె యుగమౌ!
నాకు నిను విడువ కష్టము
సాకుము దయతోడ నన్ను । సతతము రామా! (54)

కం॥ ఆత్మయె రాముడ నంచును
నాత్మయె భిన్నత్వమందె । నాయా విధులం
దాత్మకు భేదం బేలే
దాత్మానందంబె బ్రహ్మ । యయ్యేను రామా! ॥ (55)

కం॥ శ్యామల జీమూతచ్ఛవి
కోమల రుచిరాంగ దివ్య । కోదండ ధరా!
రామా ! రాజీవాక్షా !
నామదిలో నుండు ముక్తిదాయక రామా! ॥ (56)

కం॥ నను విడువకుమా రామా!
ననువిడ నపకీర్తి దప్పు । నా కనమయ్యా!
యనుదినమును గనిపించిన
ఘనమగు సత్కీర్తి నీకు । గలుగును రామా! ॥ (57)

కం॥ నినునెప్పుడు దలచు మనమున
నినుగాంచెడు కనులు నాకు । నీవే యిడుమా!
నను భక్తకోటి జేర్చగ
నినుసర్వ మయునిగ జూపు । నిజముగ రామా! ॥ (58)

కం॥ భక్తుడననెడి యహంకృతి
ముక్తుడ నేనైతిననుట । పూజ్యుడను కొనన్
ముక్తిందొరకగ నీయవు
భక్తియు గలిగించి నహము । బాపుము రామా! ॥ (59)

కం॥ ఏమియు దెలియని వాడను
నేమియొనర్చెద నటంచు । నెటులన డుగుదే
నేమియు నడుగను గావున
జేసినను నీదయే ! హరి । శ్రీ రామా! ॥ (60)

కం॥ చేడియు నర్థము నాశయు
వీడిన బ్రహ్మమున మనము । విడువక నిలుచున్
మూడిట మోహము బాపిన
నాడుగదా బ్రహ్మమయుడ । నందగు రామా! ॥ (61)

కం॥ భవితవ్యమేమొ దెలియను
తవనామ స్మరణ జేతు । దర్శనమిమ్మా!
భవజలధిని దాటించి, వి
విభవమున వెలుగొందునటుల । బరపుము రామా! ॥ (62)

కం॥ చచ్చిన వానికి మోక్షము
నిచ్చిననీకేమి లాభ । మీవుండగనే
వచ్చియు దర్శనమిచ్చియు
ముచ్చటలాడుటయె నాకు । మోక్షము రామా! ॥ (63)

కం॥ వచ్చిన నీవే రావలె
యిచ్చిన నీవంటిదాత । యీవలె గానీ
హెచ్చెడు కోర్కెలు దీర్చగ
నచ్చముగా నెపుడు దలతు । జననుత రామా! ॥ (64)

కం॥ రామా! యీ తనువుంగ
రామాదరిశనము నొసగ । రారా నిపుడే
రామా! దాసుడ గానా!
రామా యశాశ్వతపు తను । వు శ్రీరామా! ॥ (65)

కం॥ రామా! దాసుని గావగ
రామా! కఠినంబుసేయ । రఘుపతి నీకున్
రామా! న్యాయంబగునా?
రామా దయజూడ వేగ । రావా! రామా! ॥ (66)

కం॥ రామా నాలో నుంటివి
నామానస వృత్తిలోని । నడక లెఱుగుచున్
నామాన సమర్పించితి
నేమాత్రమహమ్ము లేదు । యిత్తఱి రామా! ॥ (67)

కం॥ రామా నా హృదయములో
రామా జానకిని గూడ । రామా నుజుతో
రామా దర్శన మిచ్చుచు
నామాటల వినెద వనుచు । నమ్మితి రామా! ॥ (68)

కం॥ నామానసమున వెలుగులు
యేమాత్రము నిలువకుండ । నెప్పటికిని,నీ
వామాహృతమును గ్రోలెద
నామరణ భయంబు దీఱె । నాకును రామా! ॥ (69)

కం॥ ఒకచో నిర్గుణముగ వే
రొకచో సగుణంబు గాగ । నొప్పెదు రామా
సకల జగతి ప్రకృతి మయా!
యకలంకుడ వగుచునుంటి । నౌరా! రామా! ॥ (70)

కం॥ చోద్యముగా నామదిలో
వాద్యాధికమైన ధ్వనుల । వాంతర గతులన్
సద్యశముగ వినిపించుచు
నాద్యుడవై వెలిగినాడ । వనయము రామా! ॥ (71)

కం॥ బ్రహ్మము సర్వమయంబగు
బ్రహ్మము నేనే యటంచు । భావము ధృఢమై
బ్రహ్మేతరమున నిత్యము
బ్రహ్మము నిత్యంబటంచు । బలికెద రామా! ॥ (72)

కం॥ నీ చరణ కమలములపై
నా చిత్తపు భృంగమెటులొ । నర్మిలి వ్రాలెన్
నీ చింతన సుధగ్రోలిన
నా చంచల కాంక్షలుడుగు । నయముగ రామా! ॥ (73)

కం॥ మనసే జ్యోతిర్మయ మని
మనమును గనుబొమల నడుమ । మణిగాజూడన్
మనసే బ్రహ్మమటంచును
మనసును నిలుపుటయె బ్రహ్మ । మార్గము రామా! ॥ (74)

కం॥ ఛాయా రూపముననె నెడ
బాయక దిరుగుచును నన్ను । బాలించుచు, నా
కేయాపద రాకుండగ
నాయాప్తుడ వౌచు బ్రోవు । నను శ్రీరామా! ॥ (75)

కం॥ అనుమాన మేమి లేకయె
యణువణువుననుండు బ్రహ్మ । మనుచుదెలసి,కో
గనువాడు బ్రహ్మమయుడగు
గనలేకున్నట్టి వాడు । ఖలుడగు రామా!॥ (76)

కం॥ కమలముల రుచిని మఱిగిన
భ్రమరము రుచిగొనునె నట్టి । వాడిన పూలన్
కమలాక్షుని పదములు గొను
విమలుడు పెరవేల్పు జూడ । వెదకునె రామా! ॥ (77)

కం॥ రామా స్వప్నములో నీ
నామము జపియించునటుల । ననుగనుగొనుచున్
రామా దుస్వప్నములను
యేమియు రాకుండజేయు । మెప్పుడు రామా! ॥ (78)

కం॥ నీస్మరణ మిపుడు జేతుము
నీస్మరణము మరువకుండ । నీ భారమురా
నీస్మరణమె తారకమగు
నీస్మరణే నిహము, పరము । నిర్గుణ రామా! ॥ (79)

కం॥ తను,ధన,మనములు సతతము
తనగురువున కిడినయపుడె । దనునవిషయడౌ
మునుగురువు రచనగతి,దన
మనమును నడిపినను సుగతి । మననము రామా! ॥ (80)

కం॥ త్రికరణ శుద్ధిగ నిన్నే
సకలంబని నమ్మువాని । సర్వము నీవే
సుకరముగ నిర్వహించుచు
సుకృతము గలిగింతు నీవె । సుగతివి రామా! ॥ (81)

కం॥ శ్రమలకు మూలము గ్రామా
శ్రమమును,వ్యవసాయమనుచు । సకలంబిడగా
నమరినదది మరలగ, స్వ
ప్నములోని కదలపనీకు । నను శ్రీరామా! ॥ (82)

కం॥ సర్వాత్మా సర్వేశ్వర
నిర్వాచ్యుడ నావనంత । నిగమపురుష,యం
తర్వాహినివలె నాలో
గర్వాపహృతిం బొనర్చు । కరణను రామా! ॥ (83)

కం॥ కవులకు కవితలకును, నీ
సువిశాలంబగు పదంబు । సులభంబౌనా!
యవిరళముగ జరియించెడు
పవనుండవు గాదె జీవ । వాహిని రామా! ॥ (84)

కం॥ అక్కడ జూచిన నీవే
యెక్కడ నిల్చినను నీవె। యింతయణువులో
జక్కగ గనుపింతువుగద
చిక్కవు జీవాళి కపుడు। శ్రీరఘు రామా! ॥ (85)

కం॥ ఎవరిని నమ్మను నీవలె
సవరింతురు సర్వవేళ। శాంతముతో,నీ
కు,విధేయుండను నేనిక
సవరింపగ వలయు నీవ। చక్కగ రామా! ॥ (86)

కం॥ ఇత్తునని యనవు నోటను
వత్తుననుయు జెప్పవెపుడు। వాంఛలు దొలగన్
యిత్తునని యనక నాదగు
చిత్తంబున నిలిచి యన్ని। సేతువు రామా! ॥ (87)

కం॥ ఏదో శక్తియు నాలో
నీదారికి నీడ్చుచుండె। నిరతంబును,నా
కేదారి జూపుచుంటివొ?
నాదాపున నుండి నన్ను। నడుపుము రామా! ॥ (88)

కం॥ ఎవడెవడని యేతీరుగ
భువిలో నటియింప సేతువో। దెలియను,మా
ధవుడవు నీవని వేడితి
యనితర పదమిమ్ము నిరత। మవనిని రామా! ॥ (89)

కం॥ మచ్ఛెమవై యాజలధిని
జొచ్చియు సోమకునిదృంచి। శోధించికృతుల్
దెచ్చియు బ్రహ్మకు నిచ్చిన
సచ్చరితము వినిన జదువ। సద్గతి రామా! ॥ (90)

కం॥ ధర్మాత్మా సంభ్రమ్మున
గూర్మమవై మందరాద్రి । గ్రుంకనియటు సత్
కర్మల జేయించితి,నీ
మర్మము దెలియంగవశమె । మాకిల రామా! ॥ (91)

కం॥ వరహావ తార మెత్తియు
ధరజుట్టు హిరణ్యనయను । దండించియు,నీ
ధరణిని బైకెత్తిన యో
సుర వందిత భక్త లోల । సుందర రామా! ॥ (92)

కం॥ నరహరి రూపము దాల్చియు
పరమాత్మా ! భక్తు డైన । ప్రహ్లాదు నికిన్
వరమిడి హిరణ్య కశిపును
పరిమార్చుట చోద్యమెంత । బలుడవొ రామా! ॥ (93)

కం॥ వామనుడై మూడడుగుల
భూమిని బలినడిగి చోద్య । యుగ వానిని, రా
జై మసలనీక ద్రొక్కితి,
వే! మహిమను సురలగాచు । వితరణ రామా! ॥ (94)

కం॥ మూడేడు మారులను, దును
మాడితివా! రాజతతిని । మహి నిన్నెటుగా
వేడుదును పరశురామా!
వేడుకతో గాంచుమయ్య । విడువక రామా! ॥ (95)

కం॥ దశరథ రాముడవై దశ
దిశలును కీర్తింప సత్య । తేజముతో, నా
దశకంఠు దునిమి బుడమిని
విశదంబుగ సాక నిన్ను । వేడెద రామా! ॥ (96)

కం॥ బలరామ కృష్ణు డనగా
బలమున నసురుల వధించి । భక్తుల కొఱకై
నిలలో ధర్మము నిలుపరె
సలలిత రచనాలి బోధ । సలుపుచు రామా! ॥ (97)

కం॥ బుద్ధుడవై విషయములకు
బద్ధుల గాకుండ జనుల । బాధించుచు,సం
శుద్ధుల, జేసితివే, నా
బద్ధాంజలి గొనుము సతము । బాయక రామా! (98)

కం॥ శంబల పురి విష్ణుయశుని
కింబుత్రుండై జనించి । క్షితిలో రాజున్
దంబము జూపగ ధృంచి,య
శంబును, ధర్మమును నిలుపు । స్వామీ! రామా! (99)

కం॥ నీ పది యవతారంబుల
నేపుగ, పరియించు వారి । కిత్తువు ప్రేమన్
కాపాడుచు సతంబును
పాపంబుల బాపి ముక్తి । పదమును రామా! (100)

కం॥ మునిజన హృదయ విహారా!
ఘన నీలాంబుద శరీర । కరుణా ధారా!
నిను ప్రార్థించెద రారా!
దనయునిగా జూడవేర! । ధరలో రామా! ॥ (101)

కం॥ శ్రీకారుడ వగు రామా!
నీకై యర్పింతు 'శతక' । నియమముతో, నా
కీ కృతి పద్ధతి తెలియదు,
యీకలి నను సేర్చు పథము । నిదె శ్రీరామా! ॥ (102)

కం॥ నిను వేడితి నిటు కలిగత
మనసవ క్రమసంజ్ఞ నీ ప్ర । మాదీచను,నన్
గనుమీ రామక రామయ
యనునేను యీశు కృపనిడ । యవనిన్ రామా! ॥ (103)

కం॥ రామా దశరథ పుత్రా!
రామా రాజీవనేత్ర, । రవిసుతు మిత్రా
రామా విబుధ స్తోత్రా!
రామా సీతా కళత్ర ! । రారా రామా ! ॥ (104)

ఓం తత్సత్

*****

## శ్రీ రామచంద్ర పరబ్రహ్మణే నమ:

ఉ॥ శ్రీగణనాథ నిన్నెపుడు జింతనజేసెద నన్ను గావగా
వేగమె రాగదయ్య పదివేలనమస్కృతు లేను జేసెదన్
భోగములేమి గోర ఫణిభూషసుతా గజవక్త్ర రక్తిమై
రాగల దోషజాలముల గ్రక్కునబాపుచు జూడుసత్కృపన్॥ (01)

శా॥ వాణీనాథ మహేశ మాధవులు నిర్వ్యాజ ప్రభావోన్నతిన్
బాణిద్వంద్వములన్ శిరంబుపయి సంభావ్యైకదృష్టిన్ ననున్
రాణింపగను కించినించుత యఘవ్రాతంబులం ద్రుంచుచున్
వాణిన్ మద్రసనంబునన్ నిలుపగా ప్రార్థింతు సద్భక్తిమై ॥ (02)

ఉ॥ అంకమునందు జేర్చుకొను నాత్మతనూజుని భంగినన్ను,నో
శంకర భక్తలోక హిత శంకర కింకర దోశరాశి, నా
శంకర యస్మదీయకృత సన్నుతి శబ్దచయంబు నందునే
వంకలులేని భావములు భాషకుచిక్కగ నిమ్ము యిమ్ముగన్॥ (03)

ఉ॥ పంకజ గర్భుడన్న, నలపార్వతి నాథుడు యన్న నాకు,నే
శంకయు లేదు లౌకిక విచారమునన్ దరి జేరరాదు నా
టంకము లెల్ల బాపు కపటప్రథ నొల్లగలేను నేను, నీ
కింకరుడన్ నుతించెదను కీర్తియొకించుక గోర రాఘవా!॥ (04)

ఉ॥ శ్రీరఘురామ నిన్నొకటి ప్రీతిరహస్యము జెప్పగోరితిన్
కారణజన్మ మృత్యువులు దప్పెడు మార్గముడేది సృష్టి,ని
ష్కారణ మెట్టులయ్యెడిని కారణమున్న నదెట్టులయ్యె! యా
భారమదేది నీవగుట దప్పదు తప్పుట యెట్లు రాఘవా॥ (05)

ఉ॥ రాముడవై జగాళి కభిరాముడవై మునిలోక సత్కృపా
ధాముడవై సుధామధుర ధాముడవై నరపాల లోక,సు
త్రాముడవైన నిన్నువరదా! యిటుదోచిన రీతి గొల్చెదన్
సేమముతోడ నాకనుల నిండుగ నిల్వగ రమ్ము రాఘవా॥ (06)

ఉ॥ చిన్నతనంబునుండి నిను చిత్తమునందున నెల్లవేళలన్
బెన్నిధి వోలె దాచుకుని వీత విచారుడ నైతినయ్య, నీ
సన్నుతి జేయ శక్తినిడి సాకెద వెట్టులొ దెల్ప నేరనన్
గ్రన్నన బ్రోవుమంచు ననురాగమునన్ నినుబిల్తు రాఘవా॥ (07)

ఉ॥ ఎన్నడు గల్గనీదుదయ యెన్నడు నా యఘరాశివాయు,నిం
కెన్నడు దివ్యమైన భవదీయ తనుప్రభ జూడగల్గు దిం
కెన్నడు జన్మమృత్యువుల యీడ్పుదలంగి తరించుచోట,నే
నెన్నడు జేరుకొందునొకొ యింతకుమూలము నీవెరాఘవా॥ (08)

ఉ॥ ఎన్నగరాదు నీ మహిమ యెంతదయాళుడవయ్య నీకునే
నెన్నడు నేమి సేయవలె నెవ్విధి నామది భక్తి పూర్వమౌ
నన్న? తిరంబు గల్గుటకు యజ్ఞచతుష్కము నీదునాజ్ఞ,సం
పన్నము చేత జేసితి శుభప్రద దాసుడ నేలు రాఘవా ॥ (09)

చం॥ శతమష్టోత్తర సంఖ్య పూర్వకముగా సద్భక్తి వాల్మీక, స
త్కృతిపాఠంబొడ గూర్చి యేలితివి భ్రాంతింబాపు నన్నిట్లు,భూ
పతివాచ్యుండవు నీవెకావె హరి సర్వాత్ముండవై నన్ను, నే
గతిపాలింతువొ? నిన్నుబిల్వమది పంకంబింకదా?రాఘవా॥ (10)

ఉ॥ ఎన్నగలేరు నీ చరిత మెంతటి విజ్ఞులు నైనగాని, యో
పన్నగశాయి యో పతితపావన నాకిలవేల్పు నీవయం
చెన్నియొ రీతులన్ సతము నిత్తఱి సత్తువమీఱ బిల్తునో
యన్నత్వదంఘ్రి సేవకుల నారడి బెట్టకుమయ్య రాఘవా॥ (11)

మ॥ ఎవ్వరునాకు నాప్తజనులెవ్వరు నావెత దీర్చువారు,న
న్నెవ్వరు చేరదీసె దరికెవ్వరు గాతురు నీవుదప్ప, నా
కెవ్వరు దిక్కు? నెల్లపుడు నిమ్ములదేల్తురు దేవదేవ, నే
నివ్వసుధన్ సమస్తమున కీవె ప్రధానమటందు రాఘవా॥ (12)

మ॥ కృపతోనన్ మనుపంగదయ్యా పరమార్తిన్ గుందనీకయ్య,నా
యపరాధంబుల సైపుమయ్య మదిలో నజ్ఞానమున్ బాపి,పా
ప, పయోరాశి దాటజేసి సతమున్ భద్రంబులం గూర్చగా
నెపుడున్ నావెనువెంటనుండుము, ముదంబేపారగా రాఘవా॥(13)

ఉ॥ ఎవ్వరి వేడబోనునిల నెవ్వరు నాకిలలేరు లేరు, నా
కెవ్వరితోడ నేమిపని నెవ్వరు నావెత దీర్చువారు, నే
నెవ్వరి మాటలొప్పుకొన నెవ్వరునీవలె బ్రోచువారు,నా
కివ్వగనైన దర్శనమునే యొసగందగునయ్య రాఘవా॥ (14)

చం॥ మనమున కెంతజెప్పినను మానదు చంచలవృత్తి దానినీ
మనువుగ జేసివైతుగను మాయనుమానము మాని దానినే
జనువున నేలుకొందువా ప్రసాద విషాదము లేనెఱుంగ,నీ
కనువుగ నన్ను జేర్చుకొని తాపము వాపగరాదె రాఘవా॥ (15)

ఉ॥ పాపములన్ని బోవలయు భక్తియునట్లె జనింపగా వలెన్
తాపములన్ని బోనడచి తాపసవందిత నన్ను ప్రేమతో
ప్రాపువు నీవయై పరమ భాగవతమ్ము బఠింపజేసి, నీ
తావున నిల్పుకొమ్ము వరదా! భవబంధములూడ రాఘవా! (16)

ఉ॥ నీదయలేక మామనము నిల్చునె సాధనమెంత జేసినన్
నాదు,నగాధ జీవితము నర్మిలి సేకొని నీ రహస్యమున్
నాదసుధాంబుధిం దఱచి నాణ్యపు దివ్యసమాధి జేర,నా
మోదమునిమ్ము నీదుపదముల్ జవులూరగగొల్తు రాఘవా॥ (17)

ఉ॥ నీదయచేనే గలుగు నిర్మలచిత్తము తోడి భక్తియున్
నీదయచేనే గలుగు నిశ్చలభావమునన్ వివేకమున్
నీదయచేతనే గలుగు నిర్మమతా సమతా ప్రసక్తులున్
నీదయచేత మూటికిని నెయ్యముగల్గ దరింతు రాఘవా॥ (18)

ఉ॥ ఆపదలెన్ని వచ్చినను నాప్తుడవై మము గాచుచుంటివీ !
తాపములన్ని బాపుమని దాశరథీ నిను వేడుచుంటి, మా
దావుననుండియుం బలుకధర్మముగాదని యూరకుంటివా?
తాపసవంధ్య వేగముగ త్వత్పదయుగ్మము జూపురాఘవా॥ (19)

ఉ॥ ఇంత దయామయుండవని నెవ్విధి సన్నుతి సేయువాడ,నా
చెంతనె నిల్చుచుందడవు సేయక యెప్పటి కప్పుడింపుగా
సంతత భక్తి నిచ్చుచును సర్వ విధంబుల రక్షసేయు, ని
న్నెంతగ వేడుకొన్న నది యెంతటిదో గణియింప రాఘవా॥ (20)

ఉ॥ నమ్మితినయ్య నెందఱినొ నామదిలోపల సర్వ వేళలన్
నమ్మ మఱెవ్వరిన్ బుడమి నాయధినాథుడ నీవయంచు,నా
నమ్మిక నీపయింగలిగె నన్నుదయం దరిజేర్చుమయ్య, లో
పమ్ముల నోర్చి నీపరమ పావన రూపము జూపు రాఘవా॥ (21)

ఉ॥ దీనులనెల్ల బ్రోచుటకు దిక్కొరులెవ్వరు? నీవె ధాత్రిలో
దీనుల లెక్క నీకెరుక దీనులు నుండెడు చోటెఱింగి యా
దీనుల నెల్ల గాచుటకు దీనదయాళుడ వైతివయ్య, యా
దీనులలోన నేనుగడు దీనుడ! గావగరమ్ము! రాఘవా॥ (22)

చం॥ శివుడవు నీవె బ్రహ్మవును శ్రీపతివీవె సురాసురాలు
ధ్రువమగు పట్టువీవయల భౌతికసంపద కాలవాల,మీ
వవెలయు మంత్రమీవతదు,పాశ్రితమైన మహార్థమీవ,సం
స్తవమొనరింతు త్వన్మహిత సర్వజగత్థితికేను రాఘవా॥ (23)

శా॥ నీమాయా మాటల నేనెఱుంగ గలనే నీవేకదా రామ,ని
న్నేమాన్యుండు నెఱుంగ లేనటుల నీవేతంత్ర మంత్రాళిచే
నీమాయన్ సృజియించి పెంచితివి నీయామూలముంజూడగా
నీ మాహాత్మ్యము జూపి కావుమిక నిన్నేవేడెదన్ రాఘవా॥ (24)

ఉ॥ బ్రహ్మమునందు నామనము బ్రహ్మముభాతి లయించునట్లు,నా
బ్రహ్మము నేనయై సతము బ్రహ్మముదప్ప మరొండు లేనిచో,
బ్రహ్మమె జూచినన్ వినిన బ్రహ్మమయంబగు నిశ్చయంబుతో
బ్రహ్మమె నేను నేననెడి భావము నిల్పు సతంబు రాఘవా॥ (25)

శా॥ ఓంకారంబన బ్రహ్మమే యగును నా యోంకారమే విష్ణుడౌ
యోంకారంబు శివుండగున్ దలపగా నోంకారమే యోగమౌ
నోంకారంబు జపింపగావలయు నా యోంకారమే తారకం
బోంకారంబు మహత్త్వముం దెలియ దానోంకారమౌ రాఘవా॥(26)

ఉ॥ నీనగుమోము నందు నవ నీరజపత్ర విశాల నేత్రమున్
భూనభవార్ధిచారులకు మోహకముల్ నవకోమలాంగనిన్
గానగ నాడు కన్ను లెటుగా సరి పోవును దీన పోషకా!
మానవమాత్రు నన్నుగనుమా? యభిమానముతోటి రాఘవా॥ (27)

శా॥ ఛందశ్శాస్త్రము జూడలేదటులనే శబ్ద ప్రయోగాదులన్
బొందించదగు నేర్పులేదయిన నేనోకొన్ని పద్దెంబులన్
విందున్నీకొనరించు వేడ్కమెయినన్ వేమారులున్ బాడితిన్
నిందల్భూషలు లెక్కసేయనిక మన్నింపంగదే రాఘవా॥ (28)

ఉ॥ తప్పుల వెన్నియుంగలవొ దాశరథీ! దెలియంగలేనయా!
యెప్పుడు పద్దెమల్లుటయె యించుకనేర ననుగ్రహించుమా!
యొప్పులకుప్ప నిప్పటికి యోపికతో నను గావరమ్ము నా
ముప్పులువాపి, భక్తిదగు పుష్టిని, దుష్టిని గూర్చు రాఘవా! ॥ (29)

మ॥ పశువుల్ మేతలుమాని గోష్టముల కంబాయంచు జేరెన్గదా!
దిశలంబోయిన పక్షిసంతతులు పృథ్వీజాళిపై వ్రాలె,మా
శిషువుల్ హాయిగ నిద్రవోయిరొాగి నిశ్చింతంబు రీవీధులన్
నిశిపూజల్గయికోగ రమ్ము కృపతో నిక్కంబుగా రాఘవా! ॥ (30)

మ॥ శయనాగార మలంకరింప బడియెన్ సద్భక్తితో నెల్లరున్
జయశబ్దంబులు సేయుచుం బ్రియముతో జై రామచంద్ర ప్రభో
జయజైయ్యంచు నటించగన్ బలుమనోజ్ఞ ధ్వానముల్ మ్రోగెడిన్
నయనానందము జేయ మీరుభయులు న్రారే దయన్ రాఘవా! ॥ (31)

చం॥ పరిమితిలేని లోకముల భక్తుల రక్షణసేయు నీ శ్రమం
బెరుగవశంబె నీకొరకు నిచ్చితి నా హృదయాబ్జ శయ్య,నా
నరవగుణాను మోదయగు జానకితో సరసోక్తు లాడుచున్
మురియుచు సతతమ్ము సుఖముగొని నిద్దురవొమ్ము రాఘవా! ॥(32)

ఉ॥ రాఘవ మేలుకో జనకరాజ తనూభవ తోడ వేగమే
రాఘవ మేలుకో సకలరాజులు, పౌరులు వేచియుండిరో
రాఘవ మేలుకో దయనురాజ్యము బాలన సేయగావలెన్
రాఘవ మేలుకో నిరపరాధుల సాధులబ్రోవ రాఘవా! ॥ (33)

ఉ॥ చూచెద నీదుపాదములు జూచెద బంగరురంగు చేలమున్
జూచెద జానులూరువుల జూచెద బ్రహ్మవెలుంగు నాభి, నే
జూచెద నీదుమధ్యమును జూచెద కౌస్తుభవక్ష శోభలన్
జూచెద శార్ఙ్గచాపమును జూచెద నీకరయుగ్మ కాంతులం
జూచెద కంబుకంఠమును జూచెద నావనమాలి కావళుల్
జూచెద నవ్వుమోము జవిజూచెద కమ్మని చూపుతేనియల్
జూచెద దివ్య మూర్ధమును శుభ్రకలాన్వితమౌ కిరీటమున్
జూచెద స్వప్రకాశమును జూచెడి శక్తిని నిమ్ము రాఘవా! ॥ (34)

శా॥ నీవేనంతట నిండియుంటివి గదా నీకాంక్షచే లోకముల్
నీవేకల్పన జేసినాడవు ధరన్ నీ సృష్టియే కర్మమౌ
నీవే సాక్షిగనుండి జూతువు సదానేజేయు కర్మంబులన్
నీవే కర్తవు జన్మ నాకిడకుమా! నీ దాసుడన్ రాఘవా! ॥ (35)

శా॥ సర్వంబ్రహ్మమయం జగత్తనగనీ సర్వాత్మ రూపంబుచే
సర్వంబై వెలుగొందుచుందు వెపుడున్ సచ్చిత్సుఖాతీతమై
సర్వంబున్ సృజియించి నాడవగుటన్ సర్వేశ్వరత్వంబు,చే
సర్వంబైన జగంబిదెప్పుడును నీ స్వాధీనమో రాఘవా! ॥ (36)

ఉ॥ కర్తవు, భోక్తవుం దలవ కారణ కార్యము నీవెగాదె, స
ద్భర్తవు సత్వలోముల బాలన సేయుచునుందు వీవు,స
ద్వర్తన గల్గు భక్తజన వాంఛలు దీర్చుచు దుష్ట శిక్షణన్
వర్తిలుచుండు నీదయిన వర్ణన నేనిటు సేతు రాఘవా! ॥ (37)

శా॥ కోదండంబును దాల్చినావు ఖలులం ఘోరాజిలో ద్రుంచగన్
భేదంబేమియు లేక సర్వజగముల్ ప్రీతిన్సదా బ్రోచుచున్
వేదంబుల్ దెలియంగరాని మహిమల్, వింతల్, వనోదంబులన్
భేదంబుల్, ముదముల్, విచిత్రమగు నీ క్రీడల్ గదా రాఘవా!॥(38)

ఉ॥ రూపము నామముల్దలప రూఢిగ నీకవి లేవుగాని యే
రూపములేని నీవు, బహురూపులు, నామములుం ధరించుచున్
బాపము, పుణ్యమున్ ద్వివిధ భాజక కర్మములన్ సృజించి, నీ
వేపరమాత్మవై భువి, నహీనవు వింతలు సేతు రాఘవా! ॥ (39)

మ॥ పరిశుద్ధంబగు మానసంబుగల హృత్పద్మంబు నీకిచ్చితిన్
నిరతంబుం జనకాత్మజాయుతుడవై నీవుండుమా రాఘవా!
సరినాకన్నులు మూసినం దెఱచినన్ సఖ్యంబుతో వెల్గుచున్
మరణానున్నటి వేళలందుగనరా! మానాయకా! రాఘవా! ॥ (40)

మ॥ నినుధ్యానించెద హృత్సరోహమునన్నీ దివ్యరూపంబునే
గనుచుందున్ జలజాతనేత్రయుగళిం గౌతూహలంబొప్పగా
ఘన పీతాంబరధారి ప్రేమ గలుగంగా జానకీ సాధ్వితో
డను,చిర్నవ్వులనొల్కు స్వామి మది వేడ్కన్ నిల్వుమా! రాఘవా!॥(41)

ఉ॥ దేహమునందు నాత్మయను దివ్యపదార్థము వెట్టిపంపి, వ్యా
మోహముకిట్లు జిక్కునటు బోడిమిజూపితి వీవెకాదె, యా
యూహదొలంగగా జగమిదొక్కటి మిథ్యయు బ్రహ్మసత్యమం
దూహదొలంగ బ్రోవుమి విశుద్ధముగా నిహమందు రాఘవా! ॥ (42)

మ॥ ఎపుడీదేహము యెట్టిరోగములనో యేకర్మలం దెట్టులో
నెపుడే బాధలవ్రాలి పోవునొకొ? నేనిద్దానిని నమ్మ,నా
శివుడే యీ తరుణమ్ము నందె దయతో నిమ్మా భవద్దర్శనం
బెపుడో యిత్తునటంచు నెంచకుమ తండ్రీ శాంతిమై రాఘవా!॥(43)

ఉ॥ ఎందఱినేలె నీకరుణ యెందఱ ముక్తికి దారిజూపె, న
న్నెందుకు జూడరావు దయనేల బ్రియమ్మున, జేరదీయ,లే
వెందుకు యెట్టిపాపములనే నొనరించితినో యెఱుంగ,స
ద్వందిత నిన్నుగన్గొను విదాన రహస్యము జెప్పు రాఘవా! ॥ (44)

ఉ॥ రామదయాబ్ధి, యీనిరపరాధిని నేలగ జాలమేల,మా
దేమియు కృత్యమయ్యెనొ యిదే పిలుపున్వినినంత భక్తులన్
న్నేమముతోడ వచ్చి కరుణించు మహాత్ముడ వీవుబల్కవే
యేమని బిల్తునింక మఱి యెవ్విధి పూజల సేతు రాఘవా!॥ (45)

శా॥ తల్లీజానకి నాదువేదన వినం దాక్షిణ్యముం జూపి, యే
సల్లాపంబుల వేళనో బ్రియునియుత్సంగాన నున్నప్పుడో
యుల్లాసంబున నాదు ప్రార్థనల సద్యుక్తి న్నివేదింపవే
పుల్లాంభోరహ నేత్ర నమ్మితిని సంపూర్ణమ్ముగా రాఘవా!॥ (46)

శా॥ నీవేదల్లివి దండ్రివీవె యనుజుండీవే బ్రియుండీవె గా
నీవేదోడువు నీడె వీవెయని నిన్నే నమ్మి యున్నాడరా
రావేకావగ దాసదాసు నను కర్మాతీతునిం జేయ,నీ
దౌవాత్సల్యము మేరలేనిది గదా యభ్యర్చితా రాఘవా!॥ (47)

ఉ॥ దారసుతాదులందు ధనధాన్యములందును బంధుమిత్ర,సం
చారములందు చిక్కబడి చాలగ కష్టములందుచుంటి, నా
భారముదీర్చి మోహమును బాయగ జేయుట కీవెనాకు,నా
ధారమటంచు నమ్మితిని తప్పగ బ్రోవగరమ్ము రాఘవా! ॥ (49)

ఉ॥ పుట్టితినెందుకో నిలనుపుట్టెను స్పర్థలు నన్నుసంపగా
పుట్టెడు కష్టముల్బడియు పుట్టువు సార్థకమందజేయు, నీ
పుట్టువెరుంగ నారమ పుట్టువ పుట్టినవాడు దక్కనా
పుట్టు కృతార్థన్ వెలయబూని దయన్ దయసేయు రాఘవా! ॥ (50)

ఉ॥ పట్టితివంట పాపులను పట్టినవారి దరింపజేసి, నీ
పట్టము నిల్పుకొంటినను పట్టనివాడని యూరకుందువా?
పట్టుము నాదుకేలు నొకపట్టున బాధలవార్ధి దాట,ని
ప్పట్టున నాలపింప గనుపింపదు దేహము నీకు రాఘవా! ॥ (51)

ఉ॥ రమ్ము రయమ్ము నగ్ననగరమ్ము బ్రియమ్మున జేరదీసి, తో
రమ్మగువమ్ము జిమ్మెడు వరమ్మిడు, కమ్మని నీదునామ,సా
రమ్ము సతమ్ము గ్రోలుదు వరమ్మున కిమ్మెయి ఓడజేర్చు,భా
రమ్ము వహించు నమ్మతి గరమ్మున నన్గొనుమయ్య రాఘవా!॥(52)

ఉ॥ చక్కని నీదురూపమును జక్కగ నామనమందు నిల్పుచున్
జిక్కులు పెట్టినన్ వెతల జిక్కగ నీయకు మెల్ల వేళలన్
మక్కువ నేలువాడవగు మావర మామక జీవిమ్ములో
జక్కని వెల్గు జూపుమిక జక్కగ నిందరిశింతు రాఘవా! ॥ (53)

ఉ॥ ఇమ్మనలేదు రాజ్యముల నిమ్మనలేదు ధనాదిరాసులే
నిమ్మనలేదు సౌఖ్యముల నిమ్మనలేదిల కీర్తిశోభలే
దిమ్మనలేదు దేహబల మిమ్మనలేదు గురుత్వ శక్తులన్
కమ్మని నామ, నాద సుఖమ్మొక టిమ్మనియంటి రాఘవా! ॥ (54)

ఉ॥ అందములైన పాదముల యంచులు నాదగు భాష్పధారలున్
గందినవేమొ యూష్మముల గావగ నైతిని వైరిషట్కమే
గందగజేసె నన్నుభవ కర్మల కూపమునందు మున్గి, ని
న్నందగ నేరనైతిననఘా దగనండగ నుండు రాఘవా!॥ (55)

ఉ॥ ఎందరి నేలలేదు మఱి యెందరి వాంఛలదీర్చలేదు, నిం
కెందరి దన్పలేదు యిటులెందుకు నన్గన రావదేమి, నే
నందరి కన్న పాపమతినై గతజన్మల నిన్ను జేరగా
దొందర సేయనైతి దయతోనను దీనుని గావు రాఘవా!॥ (56)

ఉ॥ కమ్మని చూపులొల్కు నధికమ్మగు ప్రేమరసమ్ము, జిల్కు, శో
కమ్ముల దొల్కు భక్తుల సుఖమ్ములె బల్కు యనాథనాథ, నా
కమ్మున నుండువారికిని కమ్మదనమ్మును నొల్కు, నీదు,నా
మమ్మె సుధారసమ్మె నియమమ్మున బారణ సేతు రాఘవా! ॥ (57)

మ॥ ఒకమాటేమి శరణ్యమీవె యనగా నో రామ చంద్ర ప్రభో
సకలంబైన చరాచర ప్రకృతికిన్ సామాన్యమే యిత్తు నం
దుకడుం దీక్ష వహించితీవు నిను నీ క్షోణీస్థలింగా వర
మ్మిక నిన్నమ్మి భజించుచుంటి నిటు స్వామీ భక్తిమై రాఘవా! ॥(58)

శా॥ రామా! సద్గుణధామ! భక్తజన మంత్రాణైకనామా! పరం
ధామా! దైత్యవిరామ! దైవగణ నిత్యస్థేమ! శ్రీ సార్వభౌ
మా! మీనాద్యవతార భూమ! రఘువంశా! మావరా! నీరద
శ్యామా! సన్నుత ధీమ! వాల్మిక కవీశాకామ్య! శ్రీ రాఘవా! ॥ (59)

ఉ॥ రామకవంశ సంభవుడ 'రామయ' నాముడ మీదునాజ్ఞ యే
నేమముతో భవన్నుతుల, నీవిధి నర్ధశతాష్టకంబుగా
నోమహనీయ సెప్పితిని యొప్పులు దప్పులు దెల్వ దీనినిన్
బ్రేమము జూచె విశ్వపతి వీడక గావుము రామ రాఘవా! ॥ (60)

కం॥ ఆత్రేయస గోత్రుండను, బ
విత్రులు గుండాంబ సూర । విజ్ఞులకు,నే
పుత్రుడ నాపస్తంభపు
సూత్రుడ రామక్క వంశజుడ । రామాఖ్యున్ ॥ (61)

*****

# మానస వినియములు

కం॥ ఓం శ్రీరామాయనమ:
ఓం శ్రీ సీతాయనమ: । ఓం శ్రీమాతా
ఓం శ్రీం హ్రీం రామానుజ
ఓం శ్రీం భరతా! రిపుఘ్న । ఓం రామనమో! ॥ (1)

కం॥ ప్రారబ్ధము దనువునకిడి
పేరు విచారములు మాని । విజ్ఞుడు దనుదా
ధీరత్వముచే తత్వ, వి
చారముచే బ్రహ్మమూను । జక్కగ రామా! ॥ (2)

కం॥ ప్రారబ్ధ మనుభవింపక
తీరదనుచు నుడివె శృతులు । తేటపడగ, నీ
కారుణ్యముతో దాసుని
ప్రారబ్ధము బాపనీదె । భారము రామా! ॥ (3)

కం॥ నాలోనుంటివి సతతము
నాలోపల నుండి విధిగ । నడపగరాదా!
కాలోచిత కర్మములను
నేలోపము గలుగనీక । నేలుము రామా! ॥ (4)

కం॥ నీచరణ సేవ నొసగుము
నీచునివలె చూడబోకు । నీదాసుడనే
నా చిత్తము నిలిపితివా
నీ చింతన జేయుచుందు । నిరతము రామా! ॥ (5)

కం॥ నామనము సంతసంబును
కామాదులు గోరు వృత్తి । ఖండించును,వో
స్వామి నినుగోరు మనము,స
దా మరిపింపకుము విడక । దలచెద రామా! ॥ (6)

కం॥ నామనము దురాలోచన
లేమేమో జేయచుండు । నెప్పటికిని, నే
నేమని భరియింతును,నే
నామది నీకప్పగింతు । నదిగొను రామా! ॥ (7)

కం॥ నామది సంకల్పములను
నేమని దెల్పుదును దిక్కు । నెవ్వరు నీవే!
నామది భక్తిని గలుగగ
కామాదుల గోరనీక । గావుము రామా! ॥ (8)

కం॥ నా మానస పుష్పంబును
నేమముతో ప్రేమమీర । నీ కర్పింతున్
స్వామీ నినుగనుకొనుటకు
నీమాయను దొలగజేయు । మీవే రామా! ॥ (9)

కం॥ రామా నామానసమిది
యేమారక దిరుగుచుండు । నెంత నిలిపినన్
నామది నిశ్చలమగుటకు
యేమిరహస్యమ్మొ దెలుప । వేరఘు రామా! ॥ (10)

కం॥ అనవసరముననుు బోవును
పనులందున నిలువకుండ । పరుగులిడుచు, నా
మనము నిలుపుటెటు దెలుపవె ?
వినెదను ప్రియమాఱ నాకు । వితరణ రామా! ॥ (11)

కం॥ నామది నిను దలచుచు,నే
యేమాశ్చర్యంబొ దెలియ । నేమఱచును, నీ
యీ మాయా నాటకమును
నామీదను జూప మీకు । న్యాయమె? రామా! ॥ (12)

కం॥ మనమును నిలుపుట కైయే
మనుజునకును దరముగాదు । మహిలోపల,స
ద్ధనమౌ నీపద సరసిజ
మున నా చిత్తాళి నిలుపు । మో రఘురామా॥ (13)

కం॥ నామది నీకర్పించితి
నీమనువుగ జేర్చుకొమ్ము । నిను సేవింపన్
నామది నీదౌటను,నా
కేమి కొఱంతయును లేక । యేలుదు రామా! ॥ (14)

కం॥ నీ దర్శనమును నొసగుచు
నాదీ నీదనెడు భావ । నము రాకుండన్
నాదేహాద్యభిమానము
నీదియును లేకుండ జేయు । మిపుడే రామా!॥ (15)

కం॥ కోదండ ధరా రామా!
నాదండనె నుందువెపుడు । నను బ్రోచుచు,నా
మీద దృణము సోకనియక
మోదముతో నేలు నీకు । మ్రొక్కెద రామా! ॥ (16)

కం॥ రామా! నావెను వెంటను
నేమారక దిరుగుచుండు । వెపుడు విడువకన్
బ్రేమ గలిగి కాపాడెడి
నీమాహాత్మ్యంబు దెలియ । నేరను రామా! ॥ (17)

కం॥ రామా! నీవుండగ నా
కేమి భయంబౌను దలప । నిరుదెసలను, నిం
కాముందర వెన్క దిసన్
స్వామీ వెలుగొందుచుంటి । సతతము రామా! ॥ (18)

కం॥ నామనమును నేగలిసియు
నీమనమై నిన్నుజేరె । నీరజ నేత్రా
నామది నేనును బోయిన
రామమయంబౌ నఖండ । బ్రహ్మము రామా! ॥ (19)

కం॥ నమ్మని తనువును నమ్మి,స
తమ్మును బోషించుచుండ । తా జెడును గదా!
యమ్మొసలిని మొద్దని తా
నిమ్మహి! నదిదాట గోర । వేమగు రామా! ॥ (20)

కం॥ తన సర్వస్వము రాముని
దని భావన జేసి గావు । మను నుతులను, దా
ననయము రామాజ్ఞేయని
పనిపనికిని దలుప ముక్తి । వడయును రామా! ॥ (21)

*****

25-12-19

# శ్రీరామ రాఘవ స్తవము

కృతికర్త : **రామక రామశర్మ**

మన్నెంపల్లి – కరీంనగరం

1975

కం॥ శ్రీ గౌరీ ప్రియనందన
బాగుగ విద్యలనొసంగు । ప్రభుడవనుచు నిన్
యోగులు దెలిసికొనెదర
య్యోగుల కిడు బ్రహ్మవిద్య । నొసగు గణేశా ॥ (1)

కం॥ వాణీ కమలాసను ప్రియ
రాణీ నను(బ్రోవ వేగ । రావేజననీ
వీణా పుస్తకధర! మృదు
పాణీ నాకభయ మిచ్చి । పాలించు దయన్ ॥ (2)

కం॥ రామాజిపేట వెలసిన
రాముడె నా హృదయమందు । రాజిలుచను శ్రీ
రామశతకంబు నాత్మా
రాముడె బలికించెసాద । రంబున రామా। ॥ (3)

కం॥ తారక నామా మృతమగు
సారము రుచిగొనినవారు । సాంబశివుడు, సా
మీరియు నారద మునియును
వేరెవ్వరు గలరు? భువిని । వెదకిన రామా! ॥ (4)

కం॥ శ్రీరామా! నీ నామము
ఘోరాఘమ్ముల నడంచు । కోరిక లొసగున్
భారము నీదని నమ్మిన
వారికి మోక్షంబు నిచ్చు । వసుధను రామా! ॥ (5)

కం॥ పుట్టించిన వాడవు చే
పట్టక భవసాగరమున । బడద్రోసితి కేల్
బట్టి నను గట్టు జేర్చుము
పట్టితి నీ పాదములను । భవహర రామా! ॥ (6)

కం॥ నీవే గతియని యెప్పుడు
భావంబున దలచుచుంటి ।పరమదయాళూ
నీవే కాపాడగ వలె
నీవేగద దిక్కునాకు । నిరతము రామా! ॥ (7)

కం॥ నాదేహాద్యభి మానము
నీదయ గలిగినను దొలగు । నిమిసంబుననన్
మోదమున జూడు నన్నిక
నీదాసుడ భారమెపుడు । నీదే రామా! ॥ (8)

కం॥ దేహాద్యభి మానముచే
మోహమ్మభివృద్ధి జెందె । మూడుడ నైతిన్
ద్రోహములగు పనులేవియు
సాహసమున జేయనీక । సాకుము రామా! ॥ (9)

కం॥ రామా! యేకాంతంబిది
నే మీతో మాట లాడి । నిను దరిశింతున్
నాముందర గనిపించుము
యీమాత్రముకరుణ జూడు । మిప్పుడు రామా! ॥ (10)

కం॥ రామా! నిశ్చింతయె గా
రా మీరుండగను నింక । తక్కువ గలదా ?
ప్రేమను రక్షించెడు యో
స్వామీనిను నమ్మియుంటి । సతతము రామా! ॥ (11)

కం॥ ఎప్పుడు నా వెనువెంటను
దప్పక దిరుగుచును యుండి । దాశరథీ, నా
కిప్పుడు దర్శన మియ్యవె
దప్పుల దొలగించి బ్రోవు । దాసుడ రామా! ॥ (12)

కం॥ ఎప్పుడు వచ్చెదరో నా
కిప్పుడు జెప్పంగరాదె । యిది బరువేనా?
చెప్పను నేనెవ్వరికిది
చప్పుడు గాకుండ రమ్ము । జానకి రామా! ॥ (13)

కం॥ అందరితో జెప్పెదనని
యందువొ నీ చరణసాక్షి । యది దెలుపను,నీ
యందముగల రూపము నా
ముందర గనుపింప జేయు । మ్రొక్కెద రామా! ॥ (14)

కం॥ ఈ తనువుండగనే నిను
జూతుననే ప్రేమనెదిరి । చూచుచు నుంటిన్
కాతర నాపక రమ్మిక
సీతను జతగూడి వేగ । శ్రీరఘు రామా! ॥ (15)

కం॥ నిను నమ్మిన దాసునకే
గనుపింపక యున్న నాకు । గతియుం గలదా!
నినువిడుతు ననుకొనెదవా
కనుపించక విడువనిన్ను । గనుమా! రామా! ॥ (16)

కం॥ కనులకు కనిపించక
పనులను నెరవేర్చుచుండు । భక్తుల కెపుడున్
నిను దలచుట వలనను నీ
వును వారిని విడువకుండు । నో రఘు రామా! ॥ (17)

కం॥ యేపేరని యేరూపని
నీపేరు లనంతములుగ । నిండెను భువిలో
రూపమ్ము లటులె నుండెను
యే పగిదిని దెలుసుకుందు । నిను శ్రీరామా! ॥ (18)

కం॥ నిను దలచునటుల జేయుము
నినుదలచక యునికియొక్క। నేరమునకు మీ
రను నీదాసులలో నొక
దనుకొని నను జేర్చుకొనవె। నాత్మా రామా! ॥ (19)

కం॥ నీమనసు నచ్చినటు నీ
నామము జపియించుటకున। నారతము నునా
కేమి విచారము రానీ
కో మంగళ రూప గొలుతు। నోరఘు రామా! ॥ (20)

కం॥ పరిపరి విధముల బిలిచితి
మొరలిడి త్వచ్ఛరణకమల। ములగొలిచితిలోన్
గరుణను గనియెదవని నను
మరువకుమిక భవమునడిపి ।మనుపుము రామా! ॥ (21)

స.ల.కం॥ దరిశనమిడి ప్రియమున గని
సరస వచనములను బలుకు। సదయ హృదయ,నీ
కరుణ గలిగినను నిహమున
పరసుఖముల బడయగలరు। భవహర రామా! ॥ (22)

స.ల.కం॥ అడుగడుగున దలిచితినిను
తడబడకను మొఱలిడితిని। తనయుడనని,ని
న్నడిగితి నొక వరమిడుమని
గడుముదమున నగుమొగమున। గనబడు రామా! ॥ (23)

కం॥ అందరిలో వీడొకడను
కుందువొ నన్నటులజూడ। కుమ నరనాథా
డెందము నీ కర్పించితి
ముందర దరిశనము నొసగు। మునినుత రామా! ॥ (24)

కం॥ బహువిధముల నినుబిలిచితి
తహతహబడి వేడుకుంటి । దాసుల బ్రోచే
సహజగుణము మఱచిన,నా
కిహపరముల కెవ్వరయ్య । యేలగ రామా! ॥ (25)

స.ల.కం॥ ఇడుములబడి దలచితి నిను
పుడమికి నధిపతివియనుచు । మొఱలిడితిని,నీ
యడుగుల మనమును నిలిపితి
జడియకుమని యభయమిడుము । జయరఘు రామా! ॥(26)

కం॥ పిలువగనే వచ్చితివని
దెలిసెను కరిరాజు కథను । దినము జదువగా
బిలిచిన రావెందులకో
దెలియను నాదప్పులేవొ । దెలుపుము రామా! ॥ (27)

కం॥ కిలకిల నవ్వుమొగంబును
కలకల లాడుచును నాకు । గనుపింపుము,నా
యిలవేల్పు నీవె గాదా!
కలకాలము నీవె గతియు । గావుము రామా! ॥ (28)

కం॥ నినుజూచిన భ్రమదీరును
యనుమానము సేయకయ్య । యార్త శరణ్యా!
మునులకు జూపిన రూపం
బును దర్శన మొసగుచాలు । బుధనుత రామా। ॥ (29)

కం॥ కనులకు కనిపంచెదవని
గనియెద నిన్నణువు మొదలు । గాగ ప్రపంచం
బున నున్న చరా చరముల
గనిపించు రహస్యముగను ।కరుణను రామా! ॥ (30)

కం॥ అపరాధము లెన్నియొ, నే
నెపుడైనను జేయుచుంటి । నేమో దెలియన్
కృపజూపుమింక నాలో
నపరాధములను క్షమించు । మయ్యా రామా! ॥ (31)

కం॥ ఆర్తజన రక్షకుండను
కీర్తి లభించినది నీకు । కినుక వలదు,నే
నార్తుడనై నినువేడితి
కర్తవు నాకభయమిచ్చి । గావుము రామా! ॥ (32)

కం॥ అలిగితివో నే బిలిచిన
నలిగిన కారణము దెలుపుమన । దీర్చెదవా?
యలకను దీర్చుటకునునే
దలపక జనకుడను గాను । దశరథ రామా! ॥ (33)

కం॥ పిలువగ లేదనియెదవో?
పిలిచిన వినబడగలేదొ? । వినినబ లుకరా
పలుమరు బిలిచిన యేమన
వలెనని మౌనముగ నున్నా । వారఘురామా! ॥ (34)

కం॥ పలుకగ నమృతము లొలుకగ
పలికెదవని యాసచేత । ప్రార్థించితి,నా
తలపులు వ్యర్థము సేయకు
పలుకననెడి దీక్షమాని । బలుకుము రామా! ॥ (35)

కం॥ నీ కభిమానము లేదా?
నీ కొరకై పడినపాట్లు । నీవెరుగనివా?
నీ కొమరుడ నేగానా?
నా కెవ్వరుదిక్కు? బ్రోవ । నరహరి రామా! ॥ (36)

కం॥ కోదండ ధారి వగుచును
పాదంబుల సేవచేయ । పవన సుతునితో
నీదండ సీత యుండగ
మోదంబిడగ గనిపించు । మ్రొక్కెద రామా! ॥ (37)

కం॥ విభవముచే మఱచితివా?
ప్రభువరుడవు నైన నీకు । భక్తుడ గానా?
యిభరాజు నేలలేదా?
యభయంబిడి నన్ను బ్రోవు । మయ్యా రామా! ॥ (38)

కం॥ నాలోనుండియు నామన
మాలోచన సేయనీకు । మని వేడితిరా!
నీలోజేర్చుము నను నా
కాలము నే దెలియజాల । గావుము రామా! ॥ (39)

కం॥ రామా! నీ నామామృత
మేమోరుచి యేమోరుచిర । యెంతో రుచిరా
యీ మాధుర్యముతో సరి
యే మాధుర్యంబుగలదె? । యిలలో రామా! ॥ (40)

కం॥ దేవత లమృతము ద్రావిరి
కావున మృతినందకునికి । గాంచిరి మరి నీ
కేవల నామామృతమును
ద్రావిన జన్మించరిలను । దశరథ రామా! ॥ (41)

కం॥ నామనమా వ్యవసాయ
గ్రామాశ్రమములను స్వప్న । కాలము లోనే
నేమరక ననుభవించును
కామాద్యరులను వధించు । ఘనుడవు రామా! ॥ (42)

కం॥ నామాన సమర్పించితి
నీమనమై నిన్ను జేరె। నిను సేవింపన్
నీమనసు తోడ నడువుము
స్వామీ నాలోన నుండి। సతతము రామా! ॥ (43)

కం॥ నామది సంకల్పమ్ముల
నేమారక సేయుచుండె। నెంతో భ్రమచే
నామది సంకల్పములను
నీమాయ యటంచు దెలియ। నేరక రామా!॥ (44)

కం॥ ఆమది సంకల్పములే
నామనసే గోరెననుచు। నరులను కొనుచున్
నీమాయ యనియు దెలియక
తామేపొందుదు మటంచు। దలతురు రామా! ॥ (45)

కం॥ నీమాయే యీ మనమని
యేమనుజులు దెలియలేరు। యీ గోప్యంబున్
నీమాయ విచిత్రంబిది
నీమాయను దొలగ జేయు। నీదయ రామా! ॥ (46)

కం॥ నామనమను భ్రమబోవలె
నీమది నను నడిపెననెడి। నిశ్చయ మెటులౌ
నామది నట్టుల జేయుము
యీమాత్రము దయదలంచు। మిప్పుడు రామా! ॥ (47)

కం॥ నామన సెప్పుడు కాదని
నీమనసే నడిపెననుచు। నే దలచెద, నా
కేమిభయ మీవు గలుగగ
స్వామీనిశ్చింత నాకు। సతతము రామా! ॥ (48)

కం। రామయనా యాసముగను
నామరణము గలుగజేయు । నమ్మితి నిన్నే
కోమల దూర్వాదళ,సు
శ్యామల రూపంబు జూపు । జయ శ్రీరామా! ॥ (49)

కం॥ కనులన్మూసిన వెంటనె
గనుచుండును స్వప్నములను । కడు వింతలుగా
మనమున బాధలు వాపియు
గనుపించుము నీవునాకు । కరుణను రామా! ॥ (50)

కం॥ పతనమునకు గారణమగు
సతతము దనమనసె తన । కసాధ్యమగుటచే
హితముగల మనము నరునకు
పతనము గాకున్నముక్తి । బడయును రామా! ॥ (51)

కం॥ మనసాత్మో త్తేజంబున
మనుజుని ప్రారబ్దకర్మ । మానక నడుపున్
మనమున జేసిన కర్మలు
తనుజేసితి నన జన్మ । దప్పదు రామా! ॥ (52) అభ్యాస సమాధి

కం॥ రామానుజ్ఞ నొసగుమా!
నేమముతో నీసమాధి । నిష్టసలిపెదన్
నామనము సహజ చలనము
యీమనము చలించనీకు । మెప్పుడు రామా! ॥ (53)

కం॥ ఆమనము బ్రహ్మమనినే
నామనమును నిలిపి జూపి । నను నిలువనిచో
నామది నహమున తానే
నేమనసును దేహమనుచు । నెలకొను రామా! ॥ (54)

కం॥ నేనే జీవుడుగా మరి?
నేనే బ్రహ్మంబ దేహి । నేనా కాదా?
నేనెవ రాలోచించిన
నేనెవరో తెలియబడును । నిజముగ రామా! ॥ (55)

కం॥ నేను శరీరము గాదని
నేనింద్రియములును గాను । నే వాక్కును గాన్
నేనంత:కరణము నా
నేనా ప్రాణములు గాదు । నిక్కము రామా! ॥ (56)

కం॥ నేను హృదయ కమలమునా
నేనా కోశములునైదు । నేనవి గాకన్
నేనా స్థూలము సూక్ష్మం
బేనా కారణ శరీర । మెటులగు రామా! ॥ (57)

కం॥ నేనే కర్మంబు లకును
నేనే ధర్మంబు లకును । నేవే రైతిన్
నేనేది యంటకుండుట
నేనే నిత్యుడన బ్రహ్మ । నేనే రామా! ॥ (58)

కం॥ అనిదృడమగు పట్టును విడ
కనునే నే దేహమెపుడు । గాదని దేహం
బును పూర్వకృతం బునకిడి
తనుబ్రహ్మము మరువకున్న । ధన్యుడు రామా! ॥ (59)

## పూర్ణసమాధి

కం॥ నామది సంకల్ప ములను
యేమేమో జేయుచుండె । యెపుడు సహజమై
యీమది నిశ్చల మెటులగు?
నామది నీకప్పగింతు । నది గొను రామా! ॥ (60)

కం॥ నామది నీకర్పించితి
నీమనమై నిన్నుజేరె । నిను సేవింపన్
నామది తోనే బోయితి
రామ మయంబయ్యె యంత । రాముడె రామా! ॥ (61)

కం॥ రామ మయమైన పిదపను
రాముడు తనలోనె దానె । రమ్యము గనుచున్
రామే తరమే లేదా ?
రామ బ్రహ్మంబనంగ । రంజిలె రామా! ॥ (62)

కం॥ ననునేను దెలియ నేరక
నిను జూతునటంచు నుంటి । నేనే భ్రమచే
తనునేను యెవరొ జెప్పుము?
తనయుడ ననుమాన పడకు । దయగల రామా! ॥ (63)

కం॥ జగమును మిథ్య యటంచును
జగమంతట నుండు బ్రహ్మ । సత్యం బనియే
పగిదిని నాకదియునుదృడ
మగునో యాబుద్ధి నివ్వు । మాత్మా రామా! ॥ (64)

కం॥ సర్వం బ్రహ్మమయంబని
సర్వాత్మా బ్రహ్మమనుచు । సద్గురు దయచే
సర్వేశ్వరు నెరిగితి నా
సర్వాశలు దొలగజేయు । స్వామీ రామా! ॥ (65)

కం॥ నేనే నిత్యుడ నంగను
నేనే బ్రహ్మంబ నగుట । నిశ్చలుడను, నా
పైన నిరతమ్ము గలదే
నేనంతట నిండియుంటి । నీదయ రామా! ॥ (66)

కం॥ బ్రహ్మము నేనై యుండగ
బ్రహ్మము నే జూతుననుట । భ్రమయే గానీ
బ్రహ్మంబే వ్యాపకమై
బ్రహ్మమె తాదనను జూడ । వచ్చున రామా! ॥ (67)

## మనో నిశ్చలమునకుపాయము

కం॥ దీనికి మూలము మనసే
గానీ యది నిలుపకున్న । కానము నిజమ
ద్దానిని నిలుపు ముపాయము
నేనే శ్రీరాముననుట । నిక్కము రామా! ॥ (68)

కం॥ మనసే ప్రపంచ మనుకుని
మనసున్న ప్రపంచముండు । మనము నిలిపినన్
మనసున నహమును బోయిన
మనసు ప్రపంచంబు రామ । మయమగు రామా! ॥ (69)

కం॥ కనుబొమల మధ్య ప్రణవము
గనునొక నక్షరము నిలిపి । గట్టిగ గనుచున్
మనమున బ్రహ్మయె ప్రణవం
మని జపమును సేయు తానె । బ్రహ్మము రామా! ॥ (70)

కం॥ బ్రహ్మము సత్యంబనియా
బ్రహ్మమె జగమంత నిండ । బడి మిథ్యయనీ
బ్రహ్మము దెలియని వారికి
బ్రహ్మము దెలుపుటకు జెప్పు । పలుకులు రామా! ॥ (71)

కం॥ బ్రహ్మము సర్వమయంబన
బ్రహ్మము సచరాచరంబు । బాయక యుండున్
బ్రహ్మేతరమే లేదని
బ్రహ్మానుభవంబు గలుగ । బ్రహ్మమె రామా! ॥ (72)

కం॥ బ్రహ్మము జాగ్రత యందును
బ్రహ్మము స్వప్నమున నుండు । బ్రహ్మ సుషుప్తిన్
బ్రహ్మ తురీయమ్మందున
బ్రహ్మంబును దెలియువాడె । బ్రహ్మము రామా! ॥ (73)

కం॥ బ్రహ్మమె చూడంబడునది
బ్రహ్మమ్మే జూచువాడు । బ్రహ్మమె చూడ్కుల్
బ్రహ్మంబే ధ్వని యనునది
బ్రహ్మమె వినువాడు జగము । బ్రహ్మము రామా! ॥ (74)

కం॥ బ్రహ్మమె గురు స్వరూపము
బ్రహ్మమె శిష్యుండు దలప । బ్రహ్మమె మనువా
బ్రహ్మమె బోధ ప్రవచనము
బ్రహ్మంబని గుర్తెరుంగ । బ్రహ్మమె రామా! ॥ (75)

కం॥ తను బ్రహ్మము గావలెనను
కొన నింద్రియ జయమహింస । గురుపద భక్తిన్
ధనమాశించక జేసెడి
పనులను బ్రహ్మార్పణమన । బ్రహ్మమె రామా! ॥ (76)

కం॥ ఏకంబై వెలుగొందుచు
ప్రాకటముగ రూపములను । బహువిధ ములుగా
లోకంబున సృజియించుచు
సాకుచు సమయింప జేయు । సాక్షా ద్రామా! ॥ (77)

కం॥ ఆకారమె లేదను శృతి
యీాకై దనమేల జేయ । నిచ్ఛ జనించెన్
నీకే లాభమ్మి లలో
చేకూరెను దెలుపు సృష్టి । జేయగ రామా! ॥ (78)

కం॥ చేసితిని విశ్వ మంతయు
నీస చరా చరము లందు । నెప్పుడు నీవై
భాసించి జనుల కర్మలు
జేసితివని జన్మమొంద । జేతువు రామా! ॥ (79)

కం॥ జనన మ్మొందిన పిదపను
మనసను మాయనుసృజించి । మనుజున కొసగన్
మనుజుడు మనసే దానను
చును భ్రమ మొందజేయ । చోద్యము రామా! ॥ (80)

కం॥ నీకర్పించితి సర్వము
నాకన్నిట యావలడగె । నమ్మితి నిన్నే
నాకేమీ నీవుండగ
నీకన్యము గలదె యెన్న । నిజముగ రామా! ॥ (81)

కం॥ లోకముల లోన నీవును
లోకము లన్నియును కుక్షి । లోవసి యింపన్
సాకెదనను శృతులన్నియు
నీకెవ్వరు సాటిగలరు । నిలువగ రామా! ॥ (82)

కం॥ ఎరుగవలె నేనెవడనొ
గరచరణము లాశ్రయించి । గురు వచనములన్
సరిగవిని శ్రవణ వచనము
లురువడి సలుపంగ దెలియు । నో శ్రీరామా! ॥ (83)

కం॥ సాధన చతుష్టయములును
సాధించుచు గురుని సేవ । సలిపి నుపనిషద్
బోధవలన సర్వం బ్ర
హ్మాధారంబనుచు దెలియు । నపుడే రామా! ॥ (84)

## యమము

కం॥ యమమన సహింప సత్యము
దమమస్తే యార్జవములు । ధైర్యము శుచితా
క్షమలును మితాహారము
దమిత దయాగుణమునదియు । నయ్యేను రామా! ॥ (85)

## -:నియమము:-

కం॥ యమనియ మములను రెంటిని
శ్రమమనకను నాదరించి । శాంతము తోడన్
భ్రమ కారణమే జగమని
భ్రమదొలగగ జేయు దెలియు । బ్రహ్మము రామా! ॥ (86)

కం॥ వేదాంత వాక్య ములువిని
వేదాంతుల దోడ చెలిమి । వీడక నెపుడున్
మోదము మీఱగ జేసిన
భేదములు నశించి బ్రహ్మ । విదుడగు రామా! ॥ (87)

కం॥ నేనుంటె జగములుండును
నేనెప్పుడు నుండువాడ । నే బ్రహ్మముగా
నేనుంటె దేహముండును
నేనే లేకున్న శవము ।నిజముగ రామా! ॥ (88)

కం॥ నేననెడి యహము దొలగెను
నేనే బ్రహ్మం బటంచు । నిశ్చయ బుద్ధిన్
నేనాత్మా భావంబున
నేనంతట నిండియుంటి । నిరతము రామా! ॥ (89)

కం॥ మనసే నిను దెలిసికొనును
మనుజు నిబంధమను భ్రమకు । మనసూ మూలం
ఘనమగు నాత్మకు మోక్షం
బును బంధమనగ గలదె । బుధనుత రామా! ॥ (90)

## -: శ్రీరామబ్రహ్మ మానసపూజ :-

కం॥ సమహృదయ కమలముననే
మముతో పూజింతు నిన్ను। మనసా, వాచా
క్రమముగ పదునారు పచా
రములను గైకొనుము స్వామి । రఘుకుల రామా! ॥ (91)

కం॥ కోమల నీలోత్పల సు
శ్యామా మణిమకుట హార । జానకి హనుమద్
రామానుజ సహితాత్మా
రామా ధ్యానమ్ము గొనుము । రా జయరామా! ॥ (92)

కం॥ సంసార విదూరుండవు
హంసాత్మా గొనుము నీకు । నావాహన మున్
పుంసా మ్మోహన రూపా!
హంసా రూడా దివినుత । హరి శ్రీరామా! ॥ (93)

కం॥ భాసుర హృత్కమలమున,ని
వాసుడవై నట్టి శ్రీని । వాసా గొనుమా
యాసనము సమర్పించెద
దాసుని కృపజూడు నీకు । దండము రామా! ॥ (94)

కం॥ విద్యాప్రకాశ దేవ,య
విద్యను నశియింప జేయు । విబుధ శరణ్యా !
పాద్యము గొనుమో దేవా
యాద్యత విహీన సచ్చి । దాత్మా రామా! ॥ (95)

కం॥ స్వర్గాది భోగములనే
దుర్గతి గానెంచి వీడు । దునునా యరిషడ్
వర్గ ప్రాణేంద్రి యముల
నర్గళమగు నర్ఘ్యమిత్తు । నాత్మా రామా! ॥ (96)

కంII వాచామ గోచరా! ప్రభు
నీచింతన జేయుచుందు । నిరతంబును,నా
వాచా, వాచ్యార్థ ములను
నాచమనము గొనుము నిశ్చ । లాత్మా రామా! ॥ (97)

కంII వదలని నీ నామామృత
మది నాహృదయంబు నుండు । నతిప్రియమున నీ
కదియే మధుపర్కంబుగ
సదయాత్మా నిడెద గొనుము । సతతము రామా! ॥ (98)

కంII పంచేంద్రి యముల చేతను
చంచల మౌనము నీదు । చరణమ్ముల, క
ర్పించితి ప్రేమను గొనుమా
పంచామృత స్నానమిదియె । భగవత్ రామా! ॥ (99)

కంII మానాభి మానముల నే
మాని సువిజ్ఞానతత్వ । మవనమునను, నే
స్వాను భవ లీనమైనది
స్నానము శుద్ధోదకంబు । స్వామీ రామా! ॥ (100)

కంII శస్త్రాస్త్రముల దాల్చి శి
రస్త్రాణమ్మును ధరించి । రంజిలు స్వామీ
వస్త్రము నీ కర్పించెద
శాస్త్రవిధిగ గొనుము వేద । సారుడ రామా! ॥ (101)

కంII అజ్ఞాన నాశనుడవై
ప్రజ్ఞాన ఘనుండ వగుచు । బ్రహ్మము నీవై
యజ్ఞోప వీతమును గొని
సుజ్ఞానం బిడుము మాకు । సుందర రామా! ॥ (102)

కం॥ అచలం బమృతంబొ నీ
కచల చలాతీత మనెడి । యానందము నే
యుచితమగు యాభరణమును
రుచిరంబుగ గొనుము సూక్ష్మ । రూపా రామా! ॥ (103)

కం॥ అందరిలో నీవుందువు
యెందరిలో నున్న బంధ । మెపుడును గలదా!
సుందర రూపా శ్రీహరి
చందన లేపమ్ము గొమ్ము । జయ శ్రీరామా! ॥ (104)

కం॥ ఎఱుకయు మఱుపును లేకయు
మఱియుచు మఱిపించుదేవ । మునిజన నుత,నా
మొఱవిని నుదుటను చిరముగ
మెఱిసెడు తిలకంబు గొనుమ । మేయా రామా! ॥ (105)

కం॥ వీక్షణముల నినుజూచెడి
దీక్షల నే బూన జాల । దీన దయాళూ!
పక్షిగమన చిత్కళలను
నక్షతలం గొనుము సదస । దాత్మా రామా! ॥ (106)

కం॥ దుష్ఫథము లణచి సత్కృతి
నిష్పన్నమగుట ప్రభుత । నీయది యౌటన్
నిష్పాపుడ జ్ఞానంబను
పుష్పంబు నొసంగుచుంటి । పొలుపుగ రామా! ॥ (107)

కం॥ నాపాలిటి దైవమవని
యోపరమేశ్వర! యనంత! । యో భవనాశా!
తాపనివారక సర్వ
వ్యాపక ధూపమిదె గొనుము । వరదా రామా! ॥ (108)

కం॥ పాపవి నాశక నామము
రూపవిరహి తుండవనుచు । రూడి దెలిసి నీ
రూపము జ్ఞానంబ నునదె
దీపము గైకొనుము బుద్ధ్య । ధిపతీ! రామా! ॥ (109)

కం॥ జీవ పరమాత్మ లొకటను
భావము నైవేద్యముగ । సభక్తి నొసగితిన్
దేవాదిదేవ నీకయి
నీవే గనుగొనుము దీని । విడువక రామా! ॥ (110)

కం॥ దంబము, దర్పము, దుష్టగు
ణంబుల విడనాడి సజ్జ । నంబులతో చిద్
బింబము గుర్తెఱు గుటయే
తాంబూలము గొనుము నీకు । దాసుడ రామా! ॥ (111)

కం॥ మనమున దలచెడి కోర్కెలు
తనువున జేయబడు వివిధ । ధర్మము లెల్లన్
ధనమున జేయు పనుల,నా
తను, ధన,మనములను గొనుము । దక్షిణ రామా! ॥ (112)

కం॥ భాను,శశి, వహ్ని తారల
లోన వసించు యునుసర్వ । లోక వ్యాప్తం
బైన తమంబు హరించుట
యే నీరాజనము గొనుము । యీశ్వర రామా! ॥ (113)

కం॥ అంతట నీవే గలవని
సంతతమును నిన్ను దలతు । సర్వేశ్వర నా
యంత:కరణ విశుద్ధి న
నంతుడ! యీమంత్రపుష్ప । మదిగొను రామా! ॥ (114)

కం॥ వ్యష్టి, సమిష్టియు నగునీ
సృష్టిని మిథ్యయని బలుకు । శృతిజాలము సం
తుష్టిని బ్రహ్మమె సత్తని
సాష్టాంగ నమస్కృతులను । సలిపితి రామా! ॥ (115)

కం॥ ఛత్రము, చామర, నృత్య,సు
పత్రము పుష్పములు గీత । వాద్యముల నొగిన్
స్తోత్రము లుత్తర పూజల
ధాత్రీశ్వర గొనుము మోక్ష । దాయక రామా! ॥ (116)

కం॥ శ్రీరామ శతకమును, నా
త్మా,రాముని పూజనము స । దా జదివిన విన్
వారికి కోరికలిడి, నా
వారేనని ముక్తి నొసగు । వాడవు రామా! ॥ (117)

కం॥ సోమరినగు నను లెమ్మని
రామా బలికించితీవు । రాత్రిం బవలున్
రామ శతకాఖ్య సంస్తుతి
రామార్పణ జేసికొంటి । రఘుకుల రామా! ॥ (118)

కం॥ ఈక్షితి కలిగత 'మనసచ'
రాక్షస వత్సర మునందు । క్రమనిరతిని యో
దాక్షిణ్య భావ మొసగితి
మోక్షప్రద కృతిని గొనుము । మ్రొక్కిద రామా! ॥ (119)

కం॥ కందమె సాహిత్యంబున
నందంబై మూలకంద । మైవెలు గొందన్
పొందుగ శతాధి కంబగు
కందంబుల నిత్తు గొనుము । కరుణను రామా! ॥ (120)

కం॥ ఆత్రేయస గోత్రుండ, బ
విత్రులు గుండాంబ సూర। విజ్ఞులకు నే
బుత్రుడ నాప స్తంభపు
సూత్రుడ రామక్క వంశ। జుడ రామాఖ్యున్ ॥ (121)

## (అనుబంధపద్యములు)

ఆ॥వె॥ మౌనదీక్ష నీకు। మాననెడి పట్టు
మాటలాడు మనుట। మాకు పట్టు
నిన్ను వేడు కునుట। నిత్యమౌ పడికట్టు
నిన్ను జేర్చు కునుట। నీకు పట్టు ॥ (1)

ఆ॥వె॥ మరణ వేళ నిన్ను। మఱచిపోదునొ నేను
నాల్క తోడ నీదు। నామ జపము
కనుల ముందునాకు। కనిపించి కరుణతో
నన్ను జేర్చుకొనుము। నీవె రామ ॥ (2)

తే॥గీ॥ మాటిమాటికి నిన్ను। బ్రతిమాలు కోనయ్య
నామ,రూపాది భేద। సంచయము నణపి
యస్తి భాతి ప్రియమ్ముల। నంద జేసి
యంతటను నీవె గనిపించు। మంటి రామ॥ (3)

తే॥గీ॥ దాన మాస్తిక్యమును లజ్జ। తపము, జపము
నమల మతియును సంతోష। మను దినమును
సలిపి సిద్ధాంత వాక్య సం। శ్రవణ వ్రతము
వరుస నీశ్వరు పూజతో। పదియు రామ ॥ (4)

*****

శా॥ శ్రీవాగీశ్వరి! పార్వతీ, భగవతీ శ్రీచక్ర సంచారిణీ
దేవీ,యీశ్వరి, చండికా, గిరిజ, చిద్బింబే మహాకాళినీ
సావిత్రీ జగదంబ శాంభవి శివా శర్వాణి మాహేశ్వరీ
కైవల్య ప్రద సర్వలోక జననీ కాత్యాయినీ పాహిమాం॥ (1)

చం॥ వరముల నెల్ల నిచ్చెదవు భక్తవశుండవు పార్వతీ సుతా!
కరుణనునీవు నాహృదయ కంజమునన్ వసియించువాడవై
సరస మృదూక్తి జాలముల జక్కగ రాముని భక్తితత్వమున్
నిరతము నిల్పియుండుటకు నిండుదయంగను విఘ్ననాయకా॥ (2)

ఉ॥ అమ్మ వరమ్ము నాకొసగుమమ్మ బ్రియమ్మున నన్నుజేరగా
రమ్మని వేడితిం గనికరమ్మున నిమ్ము జయమ్ము భారతీ!
యిమ్మహిలోన గ్రుమ్మరిన యిమ్ములుబాపగ నీవెసుమ్ము,నే
నమ్మికతోడ నుండెదను నాల్కపయిన్ వసియించు శారదా! ॥ (3)

శా॥ శ్రీరామా! జనకాత్మజా! ప్రియసఖా! జీవాళి సంసేవితా!
ధీరోదారగుణా! భవాబ్ధితరణా! దీనావనా! భక్తమం
దారా! సత్యపరాక్రమా! త్రిభువనాథా! రాసురాధీశ్వరా!
వీరా!సంగర దుష్టదానవ హరా! విశ్వేశ్వరా! రాఘవా! ॥ (4)

శా॥ శ్రీరామాశ్రిత పారిజాత! కరుణాసింధూ! రఘూత్తంసమా!
సారంబించుక లేని ఘోరమగు సంసారాబ్ధి దాటింపగా
దారింజూపిన మీరెజూపవలె నీదాసుండ నే మ్రొక్కెదన్
రారా రక్షణ జేసి గొప్ప బిరుదున్ రక్షించుకో రాఘవా! ॥ (5)

ఉ॥ ఎందరు భక్తులుం గలరొ? యెవ్వరిజూడగ బోయినావొ?యిం
కెందరు ప్రేమతో బిల్వ నే మహనీయుని గావ బోయితో
యెందరు జ్ఞానదృష్టినిను నెప్పుడు చూచుచు వీడకుండిరో
యెందుకురావు దర్శనము నేలనొసంగవు? రామ రాఘవా! ॥ (6)

మ॥ గతజన్మంబుల నిన్నుజేరుటను నేకాంతంబునన్ భక్తిచే
సతతంబున్ నినుశ్రద్ధతో దలపనో సాక్ష్యంబు మీరేకదా!
గతినీవేయని నమ్మియుంటి యిపుడున్ కారుణ్యముంజూపి,సం
చితకర్మంబు లడంచి, జన్మ రహితుం జేయంగదే రాఘవా! ॥ (7)

శా॥ వాణీనాథు డొకప్డు తాగడిగె నీ పాదాబ్జముల్ భక్తిచే
పాణిద్వంద్వమునన్ గుహుండుగడిగెన్ పాదంబులన్ వాని,నా
ప్రాణోత్కర్షణ మైన యప్పుడును నీ పాదంబుల న్వీడ, ని
ర్వాణ ప్రాప్తికి నాశ్రయించితిని నీ భారమ్ము శ్రీ రాఘవా!॥ (8)

ఉ॥ దేహ మశాశ్వతంబనుట తెల్లము నాకు మరింత యాసలన్
మోహము వృద్ధిజెందెనిక మోక్షము నెట్లు లభింప జేతువో
దేహము నేను,నాదియని దీరని దు:ఖముతో మునింగితిన్
సాహసమింత లేదు నను సాకుము నీదయతోడ రాఘవా! ॥ (9)

ఉ॥ దేహము నేనటంచు భ్రమచేతను బంధము పెంచుకుంటి నాసం
దేహము జేయగాదగదు దీనుడ కష్టము లొందుచుంటి, నీ
బాహు బలంబు చేత ననుబాధల బెట్టెడి 'కామ' మాదిగా
ద్రోహము జేయు శాత్రవుల ద్రుంచుము మ్రొక్కెద నీకురాఘవా!॥ (10)

శా॥ సర్వం బ్రహ్మమయం బటంచు శ్రుతులున్ శాస్త్రమ్ములున్ దెల్పినన్
గర్వాంధుండను నీ రహస్య మహిమల్ గాంచంగ నా శక్యమా!
నిర్వాచ్యుండ వుగా వసంతుడవు హృన్నీరేజ ముంజేరి యో
సర్వాత్మా నను నిన్ను జేర్చుకొనుమా సర్వేశ్వరా! రాఘవా! ॥ (11)

శా॥ నాలోనుంటి వటంచు నేనెఱిగితిన్ నాకేల చింతా, చయ
మ్మేలోపంబును జేయవెప్పుడును నీ యిష్ట ప్రకారంబుగా
మేలే జేసెద వెట్టి పట్టునను నామీద న్కటాక్షమ్ము, లీ
లీలం గోచరమయ్యె నీవెగలవో లీలామయా రాఘవా! ॥ (12)

శా॥ అంధుండా కురురాజు జూపుమనినాడా విశ్వరూపమ్ము,నీ
బంధుండయ్యును పార్థుడైనను నినుంబ్రార్థించినాడా దయా
సింధూ! జూపుము నాకదేవిధము నీ శ్రీపాద పద్మమ్ములన్
బంధంబుల్ దొలగున్ విముక్తి సులభంబై యొప్పు శ్రీరాఘవా!॥(13)

మ॥ కనులన్మూసిన స్వప్నముల్గలుగు నాకర్మం బదేమో కదా
మును నేజేసిన యెట్టి కర్మఫలమే మూలంబొ నేతాళ, జా
లను నాస్వప్నపు బాధబాపుమిక యేలాజాలముం జేయగా
నినునే నమ్మితి కావవే నను కృపన్ నీవాడనో రాఘవా! ॥ (14)

శా॥ నేనే బ్రహ్మమటంచు నాకుదృఢమై నేనంతటన్ వ్యాప్తమై
నేనే జూచిన బల్కినన్ వినిన గానీ నేనటంచున్ సదా
నేనే దేహమటంచు నాకు భ్రమ రానీకయ్య బ్రహ్మాను,సం
ధానమ్ము న్మరిపింప కెప్పుడును సీతానాయకా రాఘవా! ॥ (15)

శా॥ నీపాదమ్ములె నమ్మియుంటి న్నెపుడున్నీ పాటలం బాడితిన్
నీపూజల్కడు భక్తితో సలిపితిన్ నీ సేవలన్ జేసితిన్
నీపద్యంబులు శ్రద్ధతో జదివితిన్ నీ సత్కటాక్షంబుచే
లోపంబేమియు గల్గనీయకను నాలోనుంటివో రాఘవా॥ (16)

శా॥ వృద్ధాప్యంబది వచ్చిచేరె బలమున్ వీర్యంబులున్ దగ్గె,నా
బుద్ధిన్ స్తబ్దతనిండె నింక నిరతమ్మున్ నాకు పూర్ణత్వ,సం
సిద్ధిం జేకురజేసి బ్రోవుమిక నిన్సేవింతు నెల్లప్పుడున్
శుద్ధ బ్రహ్మము నేను జేరుటెటులో సూచించుమా రాఘవా! ॥ (17)

శా॥ వృద్ధాప్యంబు ఘటింప నీ బలములున్ వీర్యంబులుం దగ్గె నా
బుద్ధిన్స్తబ్ధత గాంచనీ యిపుడు నా పూర్ణత్వముం బోవునా
శుద్ధబ్రహ్మము నై వెలింగెద మదిన్ శోధించ నాకేల, నే
బుద్ధింగాను శరీరమెప్పుడును గాన్పూర్ణాత్మనో రాఘవా! ॥ (18)

చం॥ భరతుడు నిన్నువేడగను బంగరు పాదుకలీయలేదె, మీ
పరమ పవిత్రమైన మృదు పాదములంబడి మ్రొక్కుచుంటినే
కరుణను వచ్చి నామరణ కాలమునందున నీ స్వరూపమున్
దరిశనమిచ్చి జన్మరహితం బగునట్లొనరించు రాఘవా! ॥ (19)

మ॥ కరుణాసాగర నామొర న్వినగనే కాకుత్స వంశోద్భవా
వరసాష్టాంగ నమస్కృతు ల్సలిపెదన్ వైదేహి ప్రాణప్రియా
వరము ల్గోరగలేదు నమ్మితిని నీ పాదంబు లెల్లప్పుడున్
పరమాత్మా నను నిన్ను జేర్చుకొనుమా భక్తుండనో రాఘవా। ॥(20)

ఉ॥ దేహము నేను గాదనుచు దిట్టిన కొట్టిన వంతనొందకన్
దేహము జేయు కర్మములు దేహముజేసె నటంచు ధీరుడై
సోహము నేజపించుదును చూచిన విన్నను వాటియందు,వ్యా
మోహము జెందకుండ నను ముక్తిని జేర్చెదు గాదె రాఘవా! ॥ (21)

శా॥ కౌసల్యా సుత నే జనించుటకు నీ కారుణ్యమే గాని, నా
కీసంసారము జాలుచాలునిక నీ కెల్లప్పుడున్ మ్రొక్కెదన్
దాసోహంబని వేడుచుంటి దయరాదా! వేగరావేలరా?
రాసంతాపము బాపు భక్తవరదా! రాజోత్తమా!రాఘవా! ॥ (22)

ఉ॥ పట్టితి నీదు పాదముల పట్టినవారు తరించి రెందరో
పుట్టను బుట్టి నీదు దయబుట్టగ రామజపంబు జేసి,యు
న్నట్టి మునీశ్వరుండు గనినట్టి పదంబుల బట్టి ముక్తులై
రట్టి గుహాదు లందరును యట్టులనన్ దయజూడు రాఘవా! ॥(23)

ఉ॥ పుట్టిన నాటినుండి రుచిబుట్టెను నీస్మరణంబు నందునా
కిట్టుల భక్తిగల్గు నదెట్టుల జేసితివో నెఱుంగ, చే
పట్టిన వాడవీవె ననుపట్టును వీడక నిన్నుజేర్చుకొ
మ్మెట్టులనైన జేసి దరియింపగ జేయుము నీవె రాఘవా! ॥ (24)

ఉ॥ చుట్టము లెందరుంగలిసి చుట్టును చుట్టుచు చూచుచుండినన్
పట్టరు ముట్ట రెవ్వరును వట్టి ప్రతాపము బల్కు వారలే
యిట్టి భవాబ్దిలో మునిగి యెట్టుల నే భరియింతు నీవెనన్
గట్టిగ బట్టి వీడకను గట్టుకు జేర్చగ రావె రాఘవా! ॥ (25)

శా॥ రాగాదుల్బ రియింపలేను యిపుడే రావా దయా సాగరా!
యాగాదుల్భవ దాజ్ఞచే సలిపి నిన్నారాధన ల్జేసితిన్
వాగాదుల్పరి శుద్ధమౌటకును నీ వాత్సల్యముం జూపుమా
భోగాదుల్నిను గోర నాకొసగుమా! ముక్తిన్సదా రాఘవా! ॥ (26)

ఉ॥ ఎందుకు సృష్టిజేసితివొ యెందుకు నన్జనియింప జేసితో
యెందుకు గానరావు? మరియెవ్వరి వేడెదు?నేమిసేతు?నీ
కెందుకు రాదురా కరుణ? యెందరి భక్తులనేలలేదు?నా
ముందర నిల్చియున్న నినుమోదము తోడుతజూతు రాఘవా! ॥ (27)

ఉ॥ చేరితి నీపదాబ్జముల సేవ లభించు నటంతు నెంతయో
కోరికతోడ నుంటినిక కోసల నాయక రామచంద్ర నీ
కూరిమిచేత భక్తులకు కోరిన కోరికలీయలేదె? సా
మీరినను గ్రహించినటు మీ పదసేవ లొసంగు రాఘవా! ॥ (28)

ఉ॥ సాక్షిగ నుండి జూసెదవు సర్వ ప్రపంచము నెల్ల వేళలన్
దీక్షవహించి బ్రోచెదవు దీనులు నుండెటు చోటెరుంగుచున్
రాక్షసు లందరిన్వెదికి రంగము నన్వధియించు వాడవై
యీక్షితియందు ధర్మమది యెప్పుడు నిల్పెదుగానె రాఘవా! ॥ (29)

శా॥ లోకములోన నేను కడు లోభుడ మూడుడ దుర్మదాంధున్
భీకరజన్మ మృత్యువుల వీడగ జేసెడి నీ పదాబ్జముల్
నాకులభింప జేయుమిక నమ్మితి నిన్ను సదా భజించుచున్
నీ కరుణా కటాక్షములచే నను బ్రోవవగరాదె రాఘవా! ॥ (30)

ఉ॥ కర్తవునీవె నాసకల కార్యములన్ నెరవేర్చు వాడవై
యార్తిని నిన్నునేబిలిచి యంజలి జేసినరావదేమి?స
త్కీర్తికి లోపమంచు పరికింపవ? భక్తుల బ్రోచునట్టి,స
ద్వర్తన వీడగాజనునె? పాలన జేయగరావె రాఘవా! ॥ (31)

ఉ॥ గాధికుమారు యాగమును గాచిన సత్కథలెల్ల వింటి,నా
బాధలు దెల్పుచుంటి భవబంధము లంబడి బొర్లుచుంటి,నీ
గాధలు జెప్పుచుంటి కలకాలము నిన్నె స్మరించుచుంటి,స
ద్బోధలు జెప్పవింటి నను బ్రోవగ రమ్మనియంటి రాఘవా! ॥ (32)

ఉ॥ నల్లని మేనువాడ భువనంబుల బాలన సేయువాడ, చే
విల్లు ధరించువాడ, కడుపేదల ప్రేమనుజూచువాడ, నా
వల్లభుడైనవాడ యిరుప్రక్కల ముందర నుండువాడవై
చల్లని దృష్టితోడ ననుచక్కగ జూడు సతంబు రాఘవా! ॥ (33)

శా॥ శ్రీవైకుంఠ పురాధినాధుడవు లక్ష్మీదేవి యుక్తుండవై
దేవేంద్రాదులు బ్రహ్మరుద్రులును ప్రార్థింపంగ విచ్చేసి,భూ
దేవీ భారముబాపి నేలితివయా! దేవాధిదేవా! ప్రభూ!
రావా! దాసుడ నన్ను బ్రోవబడవా! రక్షింపవా! రాఘవా! ॥ (34)

ఉ॥ రమ్మని వేడితిన్ గనికరమ్మున నన్గనరమ్మ నాదు,నే
రమ్ముమహించు నీ మృదుకరమ్ము శిరమ్మున నుంచిబ్రోచు,భా
రమ్ము వహించు దాసుడ వరమ్ముల నిమ్మని కోరలేదు, నే
నమ్మితినిన్నె నీదు చరణమ్ముల సేవ నొసంగు రాఘవా! ॥ (35)

శా॥ నేనేజీవుడ నంచు వట్టి భ్రమచే నేనుంటి సర్వేశ్వరా
నేనే బ్రహ్మమటంచు నాకు దృఢమై నీ సత్కృపా దృష్టిచే
నేనే నీవని నీవు నేననుచునే నిశ్చింతతో నుండు,బ్ర
హ్మానందంబు లభింపజేయు మికనో యార్తానవా! రాఘవా! ॥(36)

ఉ॥ అంతటనున్నవాడ జగమంత సృజించెడు వాడ యాది, మ
ధ్యాంతము లేనివాడ కడునార్త జనంబుల నేలువాడ, వే
దాంతు లెరుంగువాడ కలడన్నను లేదననుండువాడ, నా
చెంతన నుండువాడ నిను చింతన జేసెద బ్రోవు రాఘవా!॥ (37)

శా॥ సంసారంబను సాగరంబున బడన్ సంతోషమా నీకు యీ
సంసారాబ్ధి దరింప జేసినను నీ సాన్నిధ్యమున్ బాపుచున్
హింసింపం దగునయ్య భక్తవరదా! హే జానకీ నాథ, నీ
పుంసాం మ్మోహనరూపు జూపుమిపుడే మోక్షమ్మదే రాఘవా!॥ (38)

ఉ॥ అందరియందు ప్రేమ గలడందురు విజ్ఞులు నెల్లవేళ, నా
యందును లేకపోవుటకు నేయపరాధము జేసియుంటినో
తొందరగల్గి వేడితిని దోచదు లోకము లందులెల్ల, నీ
వుందువటన్న సత్యమును నుల్లమునాటగ దెల్పు రాఘవా! ॥ (39)

చం॥ అతిమధురంపు నీకథలనంతము లన్విన తృప్తిలేదు, నా
కితరములైన వట్టి కథలేల రుచించును? దీనరక్షకా!
సతతము పక్షిజాలములు సాధుఫలంబులు గోరునట్లు నా
మతమిది నిన్ను జేరుటకు మానసమెప్పుడు గోరు రాఘవా!॥ (40)

ఉ॥ వందనమయ్య రామ! బుధవందిత! శీలగుణాభిరామ! నీ
యందము చందమామ ముఖమంచు కళల్గన సార్వభౌమ,నీ
కుందగు భక్తిప్రేమ ఘనకోమల శ్యామలవర్ణ రామ, యా
నందమెరూపమా? యనెడు యాత్మయు నీవెసతంబు రాఘవా!॥(41)

ఉ॥ అన్నిటిలోన సాక్షిగను నంతట నుండి చరా చరంబులం
దెన్నియొ నామరూపముల వెప్పుడు?యెక్కడ? యేక్రమంబునం
దున్నయనేక వర్ణముల నుచ్చము నీచము బొందియున్న, నీ
వన్నిట నంట కుండగనె యాటల నాడెద గాదె రాఘవా! ॥ (42)

శా॥ రామా! నాహృదయాధి నాథుడవు యీరాత్రింబవల్ నీవు న
న్నేమేమో పనులెప్పుడే విధముగా నేమేమి చేయించితో
కామాదీంద్రియ బుద్ధి జాలములచే కర్మంబులం జేసెనో
స్వామీ కర్మఫలంబు నీదె యెపుడున్ సర్వాత్మకా రాఘవా! ॥ (43)

చం॥ దశరథరామ! దుష్టజన దైత్యవిరామ! మహోఘ భీమ యో
పశుపతి ప్రేమతో దలచు పావననామ విధాతృసేవితా
కుశికనుతా! మనోహృదయ కోశసుధామ నినున్నుతించగా
వశమగు నామదాదులకు భానుకులాంబుధి సోమరాఘవా! ॥(44)

శా॥ నీకాకారము లేక నీవిధము నన్నీవాట లాడంగ నీ
లోకంబుల్ సృజియించి యన్నిటిని యాలోకించి జీవాళివౌ
యాకారంబుల లోన జేరితివి నీ యాటల్మ నస్ఫూర్తిగా
నాకోర్కెల్ నెరవేర్చు కొందువుగదా యాశ్చర్యమో! రాఘవా! ॥(45)

ఉ॥ చూచిన వృక్షజాలముల చోద్యము లెక్కలు బెట్టవచ్చునే
చూచిన బీజమెంతయని చుక్కలనంటగ బోవుటేమి?నే
జూచిన పూలరంగులును చూపులకందని కాయలాకులున్
యోచన కందజాలవని యోగులు జూచిన నేమి రాఘవా! ॥ (46)

ఉ॥ పూజలు సేయలేనిపుడు బుద్ధిని నిల్ప సమాధి నిష్టచే
తేజము బ్రహ్మమంచు కడు తేటగజూడగలేను లక్ష్యమున్
నీజముల్ దపంబులును నెమ్మది జేయగజాల వృద్ధుడన్
నాజనకుండ వీవెయని నమ్మితి భారము యీవె రాఘవా! ॥ (47)

ఉ॥ నేననువాడె యంతటను నిండినవాడ చరా చరంబులుం
దాననువాడె యెప్పుడు ముదంబును భేదము లేనివాడె దా
మానము లేనివాడె యభిమాన మెఱుంగని వాడె భేదమున్
లేని మహాత్ముడే కద చలింపగ గన్గొను నిన్ను రాఘవా! ॥ (48)

మ॥ మనసెల్లప్పుడు దుర్విచారములతో మగ్నంబుగా జేయునే
మనినన్ చంచల వృత్తి దానిగుణమున్ మాన్పంగ నా శక్యమా!
మనమున్సంతత మప్పగించితిని రామా! నిన్నుసేవించు గై
కొనుమా యెప్పుడు దానివీడిన జికాకుం జేయునో రాఘవా! ॥(49)

ఉ॥ నీదయ గల్గజీవునికి నీవనుకూలుడ వౌచు నుండగా
నాదియు నీదనే భ్రమను నాశముజేసి నిరంతరంబు ని
ర్వేదనలొంద కుండగను విజ్ఞునిగా గను బ్రహ్మనేననే
మోదము గల్గజేయుచును మోదము నందగజేతు రాఘవా! ॥ (50)

ఉ॥ మచ్చము కూర్మమై కిటియు మానరసింహము వామనుండవై
సచ్చరితుండు భార్గవుడు సద్గుణ జాలుడు రామ చంద్రుడై
యచ్చపు పుత్రులో యనగ నాబలకృష్ణులు బుద్ధ, కల్కియై
చెచ్చెర ధర్మరక్షణము జేయగ వచ్చితి గాదె రాఘవా! ॥ (51)

మ॥ జననీజానకి నామొర న్వినుమిదే సర్వంబెరిం గించెదన్
ఘనుడా రాముని దర్శనంబు కొరకే కాంతంబు నన్వేడినన్
వినరానట్టు నటించు నెప్పుడును నీవే ప్రేమతో దెల్పి నీ
వునుమాతండ్రియు గూడిరండు హృదయమ్ముల్ బొంగగారాఘవా! ॥ (52)

మ॥ ఇదిమత్తేభము దీనిగైకొనుము నీ యిచ్ఛాను సారంబుగా
ముదముప్పొంగగ జానకీ రమణితో ముల్లోకము ల్దిరుగగా
నిది నీకుందగు వాహనంబు మరి నీవెల్లప్పుడుం సంచరిం
చెదవంచుం గడుభక్తితో నొసగితిన్ సీతాపతీ! రాఘవా!॥ (53)

మ॥ సతతము నీదు కంఠమున చంపకమాల లలంకరించెదన్
సుతుడవటంచు నన్నెపుడు జూడుమ గైకొని ప్రేమతోడుతన్
వితరణ లేమి నేనెరుగ విజ్ఞుడ నేనియుగాను నిన్ను నా
పతివని నమ్మియుంటి నిక పాలన సేయగ రావె రాఘవా!॥ (54)

ఉ॥ ఉంచితి పూజసేతునని యుత్పలమాలలు నీకునేను సమ
ర్పించితి వృత్తరూపమున పేరిమి గైకొనుమయ్య నిన్ను మె
ప్పించెడి భక్తి నాకొసగు వీడకనిన్ను స్మరించుచుందు మ
న్నించుము నాదు ప్రార్థనము నీపదసన్నిధి జేర్చి రాఘవా! ॥ (55)

ఉ॥ శ్రీపతి నామమున్ స్మరణ జేయుచు నుండిన జాగు సేయకే (మానసబోధ)
యాపదలన్ని వాపుచును యాప్తుడె తానయివచ్చి బ్రోచు సం
తాపము గల్గి వేడినను తాపము లన్నియు బాపుచుండు నా
దాపున నుండుమా యనిన తప్పక దగ్గర జేరు మానసా! ॥ (56)

ఉ॥ తప్పులనెన్ని జేసినను దాశరథీ కరుణాసముద్ర! నే
నిప్పటినుండి జేయనని నీవెశరణ్య మటంచు వేడగా
తప్పకవచ్చి బ్రోవుమన దాత రఘూద్వహు డట్టివాడు నీ
కెప్పుడు కష్టమున్న నెపుడెయ్యది కోరిన నిచ్చు మానసా! ॥ (57)

మ॥ వినుమాబ్రహ్మము నీవెయెప్పుడును నీ విజ్ఞానమేమయ్యెనో
నినునీవే భ్రమ చేతనే మరచి నేనే జీవుడన్నాది యీ
తనువంచు న్గడుమోహ మొందుచును నీ దార్ఢ్యంబు భగ్నంబుగా
జననంబున్ మరణంబు నొందదగునా సంసారివై మానసా!॥ (58)

ఉ॥ బ్రహ్మమె నిండియుండెనను భావము విస్మృతి జెందినావె?యా
బ్రహ్మము లోననుండియు ప్రపంచము రూపము లన్నివస్తువుల్
బ్రహ్మమటం చెరుంగకయె భావము సృష్టినుపక్ర మింతువా?
బ్రహ్మ ప్రకాశమీయక ప్రభావము సాగదు నీకు మానసా!॥ (59)

శా॥ నీవాబ్రహ్మము నందు బుట్టియును నేనే మాయనాన్ మూర్ధమౌ
నీవాజీవుల బ్రహ్మమంచెఱుగకన్ నీమాయలన్ నాట్యముల్
గావింపంగనె నీకు లోబడునటే గర్వోన్నతిం జెందకన్
భావాతీతుని రామునిన్ దలచినన్ భద్రంబగున్ మానసా!॥ (60)

ఉ॥ జీవులనెల్ల జేర్చుకుని శీఘ్రము మోహము నందజేయుచున్
జీవులు బ్రహ్మమౌటయు ప్రసిద్ధము దానిని మర్వజేయుచున్
గేవల ద్వంద్వమౌ ప్రకృతికిం బలిజేయగ నాట లాడెదో
జీవులు వెల్గుచున్నపుడె జేకురు సర్వము నీకు (మానసా)రాఘవా! ॥ (61)

ఉ॥ జీవప్రకాశ మున్నపుడె చేతువు గాని ప్రకాశ ముడ్గినన్
నీవశమేమిగాదు మరణించిన జీవులవెంట నంటుచున్
జీవుడు పూర్వ జన్మమున జేసిన కర్మఫల క్రమంబుతో
నావల జన్మమెత్తుమని యందువు వీడక యుండి మానసా! ॥ (62)

ఉ॥ జీవుడు బ్రహ్మతత్వమును జెప్పిన సద్గురు బోధచేత నా
జీవుడె బ్రహ్మయంచు స్మృతిచే తనబుద్ధిని నిశ్చయింపగా
నేవిధమౌదు బ్రహ్మమని యెంచుచు జీవుని-బ్రహ్మ వేరుగా
భావనజేయ నేర్పెదవు ప్రాణులపై దయలేక మానసా! ॥ (63)

శా॥ నీవా బ్రహ్మమటంచు గుర్తెరిగితిన్ నేనాత్మ భావంబునన్
నీవే కల్పనలెన్ని జేసినను గానీ వేరుగా జూతునా
నేవానిన్గని యెండమావుల వలెన్ నిర్మోహముం జెందుటన్
భావంబంతట నిండియుంటి యనినన్ బాధింపవే మానసా! ॥(64)

శా॥ నీవున్ వేరని నేనువేరనినచో నీమాయ బాధించునన్
న్నీవే నేనని నేనె నీవనినచో నీవెప్పుడున్ బ్రహ్మమే
నీవే వింతలనెన్ని జేసినను నే నిర్మోహముం జూచెదన్
నీవా బ్రహ్మము నెప్పుడుం దలుపుమా నిశ్చింతతో మానసా! ॥(65)

ఉ॥ అందరిలోన నీవె జగమంతట యీ సచరా చరంబులో
నుందువు మాయరూపముల నొప్పుచు జీవులవెంట నుండి,నీ
వెందరి మాయలో బడగ నెందరి మోహము నొందజేసితో
వందనమేను జేసెదను వద్దిక మోసము మాను మానసా! ॥ (66)

శా॥ బ్రహ్మజ్ఞానులలోన నుండెదవు నిన్ పాటింతురే వారు యా
బ్రహ్మంబున్గను చుందురంతట నదే భావంబు పూర్ణంబుగా
బ్రహ్మాదుల్ జగమెల్ల మిథ్యయె పరబ్రహ్మంబు సత్యంబుగాన్
బ్రహ్మానందము తోడనుండెదరు సద్భక్తిన్ సదా మానసా! ॥ (67)

ఉ॥ అంతటనుండు బ్రహ్మమెపుడైనను నెక్కడ నిల్చిచూడ నెం
తెంత విచిత్రమా! మహిమ మేమని వర్ణన జేయువాడ నా
వింతలు జూచినన్వినిన విభ్రమజెందుదు రెంతవార లా
ద్యంతము తెల్వలేదెవరు నారయ నీధరలోన మానసా! ॥ (68)

శా॥ ఏకర్తృత్వము లేదునాకు నికనేనెల్లప్పుడున్ బ్రహ్మమై
లోకంబుల్ సచరా చరంబులను నాలోనుండు బీజాకృతిన్
నాకాకారము లేక పోవుటను నేనంతర్బహి వ్యాప్తమై
యేకంబై వెలుగొందుచుందు వినుమా యీగోప్యమున్ మానసా! ॥(69)

శా॥ నీమాయన్ నను మోసగింపగలదా నీ యత్నముల్ సాగునా
నీమాయన్ గని బ్రహ్మమే యనుచునే నిశ్చింత తోనుందు నా
కేమాశ్చర్యములేదు నాకితరమున్ నీమాయ నన్నంటదే
యీమాత్రంబు నెరుంగ సంశయము నీకేముండునే మానసా! ॥ (70)

శా॥ నాదేహంబ మనంత నవ్వెననలుం దత్యంత మాశ్చర్యమున్
నాదీభార్య యటన్న నవ్వెను మదిన్ కాముండు నచ్చెర్వునన్
నాదీగేహము పుత్రసంపదలన్ దానవ్వె మృత్యుండు లోన్
వాదంబుల్ విడిగాంచుమీ సకలమున్ బ్రహ్మంబుగా మానసా! ॥ (71)

*****

# శ్రీమదాంజనేయ స్తుతి

రచయిత :

**బ్రహ్మశ్రీ రామకరామశర్మ గారు**

మన్నెంపల్లి మం॥తిమ్మాపూర్

జి. కరీంనగరమ్ రా. తెలంగాణ

ప్రథమ ముద్రణ : 1979

ద్వితీయ ముద్రణ: 2020

ప్రతులు : 500

# -: శ్రీ హనుమస్తవము :-

కం॥ శ్రీఆంజనేయ సుజన,వి
ధేయా భక్తార్తి హరణ । దీన శరణ్యా!
ఛాయా రవిసుత మారుతి
రాయా! భవ భయ విచార, । రక్షక హనుమా ! ॥ (01)

కం॥ శ్రీరామ చంద్రు డెప్పుడు
రారా! హనుమయ్య యనగ । రయమున రావా
మారాడక చెప్పిన పని
సారమ్ము నెరింగి సేయు ।సరసుడ హనుమా ! ॥ (02)

కం॥ వీరాంజనేయ నాకా
ధారమ్మెప్పుడును నీవ । దాసుని బ్రోవన్
రారమ్ము ఘోరమగు, సం
సారాంబుధి దాటవేయు । సరగున హనుమా ! ॥ (03)

కం॥ అంతట రాముడె గలడని
సంతతమును నాకు దృఢము । సల్పుము బుద్ధిన్
చింతించు దుష్ట మనము, ర
వంతయు లేకుండ జేయు । బంట-సు హనుమా ! ॥ (04)

కం॥ రుద్రాంశమునను బుట్టి, స
ముద్రంబును దాటినట్టి । పురుషార్థివి, నీ
భద్ర యశంబును బొగడగ
రుద్రాదుల కైన తరమ । రూడిగ హనుమా! ॥ (05)

కం॥ రాముని ప్రియదూతవు శ్రీ
రాముని మదిలోన విడక । రాత్రిం బగలున్
రామ జపంబును సేయుచు
కామము క్రోధమును జయించు । ఘనుడవు హనుమా! ॥ (06)

కం॥ శ్రీరాముని భక్తులకును
కోరిక లన్నింటి నిచ్చు । గుణివి దయాళూ!
శ్రీరాముని జూపించుము
వేరే కోరికలు లేవు । వినుమో హనుమా! (07)

కం॥ నీవలన గాని పనులను
దేవేంద్రుడు చేయలేడు । తికమక పడెడున్
దేవా! నీమహిమలు గన
భావా తీతుడవు నీవు । భళిరా హనుమా! ॥ (08)

కం॥ ఊరూర నుండి జనులకు
తీరని బాధలను బాపు । దీరుడ వీవే
లేరెవ్వరు నీతో సరి
ఔరా! నీవాత్మ బంధు । డౌగద హనుమా! ॥ (09)

కం॥ నీనామ మెపుడు దలచిన
గానీ వినుచున్న దుష్ట । గ్రహములు వీడున్
నానా రోగము లుండిన ।
దీనార్తుల యార్తులెల్ల । దీర్తువు హనుమా! ॥ (10)

కం॥ రాముడు నిను కౌగిట గొనె
రాముని ప్రియ దూతవౌట । రా నీభాగ్యం
బేమని బొగడగ వలెరా?
నామది కానందమయ్యె । నగధర హనుమా! ॥ (11)

కం॥ భయమున సుగ్రీవుడు నిను
పయనంబగు వారలెవరొ? । పరికించుమనన్
రయమున బోయి కనుంగొని
భయపడకను జెప్పినట్టి । బలుడవు హనుమా! ॥ (12)

కం॥ అనుమా నించకు జెప్పెద
వినుమా సుగ్రీవ నీకు । విశదంబుగ వీ
రనుకూలమైన రాజులు
ఘనవిలు విద్యలను వీరి । గనుమనె హనుమా! ॥ (13)

కం॥ రాముడు లక్ష్మణు డిప్పుడు
ప్రేమను నా భుజము లెక్కి । విచ్చేసి రయా
క్షేమమగు వీరి సఖ్యము
నీమది కోర్కెలును దీరు । నిజమనె హనుమా! ॥ (14)

కం॥ అని సఖ్యము గుదిరించియు
పనులను నెరవేర్చి నట్టి । ప్రజ్ఞ గలదు నీ
కని మ్రొక్కితి దయతోడను
నను రాముని కప్పగించు । నరనుత హనుమా! ॥ (15)

కం॥ జీవాత్మయె పరమాత్మగ
నీవాత్మను గుర్తుతెలియ । నియమ మదేదో?
నీవే దెల్పుము నాతో
నీవాడను సేవకుడను । నీదయ హనుమా! ॥ (16)

కం॥ నిన్నాశ్ర యించితిని యా
పన్నుల రక్షించు దీక్ష । బట్టితివని ని
న్నెన్నడు కోరిక లడుగను
నన్నెప్పుడు విడువకయ్య । నమ్మితి హనుమా! ॥ (17)

కం॥ నిన్నాశ్ర యించు వారికి
నెన్నడు నాపదలు గలుగ । విదినిజము సుమా!
పిన్నలు పెద్దలు కోరిక
లెన్నియు కోరినను వారి । కిత్తువు హనుమా! ॥ (18)

కం॥ వినుమయ్య నీదుశతకం
బును రచియించుటకు నాకు । బుద్ధి నొసగ నీ
వును నా యంత:కరణం
బున జేరియు వాక్పటుత్వ । మొసగుము హనుమా! ॥ (19)

కం॥ నూరామడ సంద్రమ్మును
ధీరా! నెటు దాటితీవొ । సీత శుభమ్మున్
శ్రీరాముని కెరి గించితి
నారాముడు నిన్ను బొగడె । నయ్యా హనుమా! ॥ (20)

కం॥ భూత, ప్రేత, పిశాదులు
భీతిన్ పరుగెత్తు నీదు । పేరును వినగా
భేతాళ ప్రయోగాదులు
నీతీర్థము గ్రోల విడుచు । నిజముగ హనుమా! ॥ (21)

కం॥ ఎప్పుడు నిన్ స్మరియించెద
తప్పక నా వెంటనుండు । దయతోడను, నా
తప్పుల నెంచకు మికనా
కిప్పుడె శ్రీరాము జూపు । మింపుగ హనుమా! ॥ (22)

కం॥ మనమున నిను నేదలచెద
నన, మనమును దిరుగుచుండు । నది నిలిచెడిదా?
మనమును నిల్పక లేదని
యనకుము దోషంబు మనము । దయ్యేను హనుమా! ॥ (23)

కం॥ వీరాంజనేయ సదయా
ద్వారంబున నున్న మాయ । తలుపు దెరువుమా!
శ్రీరాముని దర్శించెద
వేరే సాధనలు లేవు । వినుమో హనుమా! ॥ (24)

కం॥ నీదయతో సులభముగను
వేదన లేకుండ రామ । విభునిగన నగున్
వేదమ్ములకును శాస్త్ర వి
వాదములకు చిక్కడతడు । వసుధను హనుమా! ॥ (25)

కం॥ వేసట జెందక రాముని
దాసుల రక్షించ దీక్ష । దాల్చిన వాడా!
కేసరి నందనుడను నీ
దాసుని నను బ్రోవుమయ్య । దయతో హనుమా! ॥ (26)

కం॥ శరణని వేడిన వారిని
కరుణించియు సర్వజనుల । గాపాడెడు నీ
కరమును నా శిరమున నిడి
వరదా! నాకభయ మీయ । వలెనో హనుమా! ॥ (27)

కం॥ నవనిధులు సిద్ధులెనిమిది
యవలీలగ నిత్తువనుచు । ననె సీతవరం
బవసరముగ నీకిడె నటు
లెవరడిగిన వారివారి । కిత్తువు హనుమా! ॥ (28)

కం॥ తులసీ దాసుని మనమున
నిలిచితి నిను దలచినంత । నీదయ చేతన్
కలకాలము నీ దాసుడ
నిలువుము నా హృదయమందు । నిరతము హనుమా! ॥ (29)

కం॥ రాముని కన్నను మహిమయు
నామములో నున్నదనుచు । నరులకు దెలుపన్
రామ జపము నే జేయుచు
నా మహిమయె మోక్షమిచ్చు । నంటిని హనుమా! ॥ (30)

కం॥ నిను దలచు వారికిత్తువు
ఘనబల బుద్ధులునుయశము । కడుధృడ ధైర్యం
బును నిర్భయము నరోగత
పనుల నజాడ్యం బపార । భక్తిని హనుమా! ॥ (31)

కం॥ సీతామాతకు దెలుపుము
నాతాపత్రయము బాపి । ననుబ్రో చుటకై
యేతీరుగ నైన ప్రకృతి
చేతన్ బాధపడకుండ । జేయుము హనుమా! ॥ (32)

కం॥ ఈతనువ శాశ్వతము గద
చేతనముండగనె ధృడము । సేయుము నాకున్
బ్రీతిగ భక్తి జ్ఞానము
చేతను వైరాగ్య మిమ్ము । చిన్మయ హనుమా! ॥ (33)

కం॥ రాముని నామా మృతమును
ప్రేమగ పానమును జేయు । విజితేంద్రియు డౌ
రామును, సీతను హృదయపు
ధామముననను నిలిపి చూడు । ధన్యుడ హనుమా! ॥ (34)

కం॥ సనకాది మహా ఋషులును
వనజా సనుడైన గాని । వాసవు డేనిన్
నిను బొగడ జాల రన్నను
మనుజులకు నుతింప తలపశక్య । మగునా హనుమా! ॥ (35)

కం॥ నవనవ రామ రసాయన
మవనిని దొకరనిది నున్న । దదినీ వద్దన్
పవనజ నినుబొగడెద నిడు
భవరోగము బాసి ముక్తి । బడసెద రామా! ॥ (36)

కం॥ బంగారు కొండమేను జె
లంగగ గద చేతబట్టి । లంఘించుచు ను
ప్పొంగుచు కుండలముల మెర
యంగను నినుజూడ తరమె । యవనిని హనుమా! ॥ (37)

కం॥ ఒకపరి హుమ్మని యురిమిన
సకల జగంబులును వడకు । సంభ్రమము లింకున్
చకచక నడచుచు దుమికిన
ప్రకటిత నగతతియు భువియు । పగులును హనుమా! ॥ (38)

కం॥ నీయుగ్ర రూపమును గన
వేయిగనుల వానికేను । విభ్రమ మెపుడున్
జేయు పనులేమి దోచక
హాయని చతికిలను బడుదు । రందరు మనుమా! ॥ (39)

కం॥ ఎవరు ప్రయాణపు వేళను
కవితా రంభమునను చెడ్డ । కలలు కనినచో
నవరోధంబుల బెడదల
పవనజ  నీ స్మరణ విజయ । వంతము హనుమా! ॥ (40)

కం॥ నీదగు విక్రమ బలముల
కేదియు సరిలేదు భువిక । పీశ్వర జూడన్
నీదయ గలిగిన వారలు
నేది యడుగ వానినిత్తు । వింపుగ హనుమా! ॥ (41)

కం॥ నీవు విభీషణుని మనో
భావము రామునకు జెప్పి । భక్తుని వీనిన్
గావదగు నభయమిడు మన
నీవచనము నట్లు నిచ్చె । నిక్కము హనుమా! ॥ (42)

కం॥ అపుడు విభీషణుని కొరకు
నిపుణతతో చెప్పితీవు । నీ సఖుడగుటన్
కృపతో రాముని దర్శన
నిపుడిమ్మన నాతడొసగె । నేపుగ హనుమా! ॥ (43)

కం॥ అంజని ప్రియతనయా కపి
కుంజర సురనాథ కోటి । ఘోర ప్రతాపా
యంజలి జేసెద నోమృ
త్యుంజయ సుత బ్రోవుమయ్య । దోర్బల హనుమా! ॥ (44)

కం॥ ఎచ్చట రామభ జనలో
నచ్చట నంజలి ఘటించి । యానం దముతో
వచ్చెడి కన్నుల భాష్పము
అచ్చెరు వొందుచును విందు । వయ్యా హనుమా! ॥ (45)

కం॥ ఎప్పుడు నా హృదయంబున
తప్పక వసియించు మయ్య । దయతోడను నీ
వెప్పుడు రాముని దలచెద
వప్పుడు వినిపించు నాకు । నా ధ్వని హనుమా! ॥ (46)

కం॥ ఆ నాదము వినినంతనె
నేనెప్పుడు రామజపము । నేజేయు నటుల్
నీ నామము మరిపించకు
మా! నామది చంచలతను । మాన్పుము హనుమా! ॥ (47)

కం॥ ఓ వాత్మాజ సురనుత
యో వానరరాజ దూత । యో కపినాథా!
యో వాగ్దాతా! శివసుత
మావాంఛిత మొసగు నేత । మారుతి హనుమా! ॥ (48)

కం॥ అతులిత బలధామా! యని
సతతము నినుబిలువ పలుక । సవ ుయమె రాదా?
సుతుడని యనుకొన లేదా!
బ్రతిమాలుచు మ్రొక్కుచుంటి । బలుకుము హనుమా! ॥ (49)

కం॥ భజరంగబలీ భవహర
విజితేంద్రియ సుగుణధీర । విజయ విహారా!
సుజననుత జానకీపతి
భజన సదానంద రామ । భక్తా హనుమా! ॥ (50)

కం॥ అంజని తనయా రమ్మని
యంజలి జేసితిని నన్ను । నరయగ రావా
మౌంజీధర నీ పదయుగ
కంజములం బడితి దయయె । గలుగదె హనుమా! ॥ (51)

కం॥ ఆహా యెంతని బిలిచిన
నోహోయని మాట వినెద । నో యనరాదా!
సోహమ్మని నే వేడెద
నీ హాయిని రామభక్తి । నీయవె హనుమా! ॥ (52)

కం॥ ఒక మాటాడుము నాతో
సకలేంద్రి యముల జయించు । సాధన యేదో
సతతము దెలుపుము వేగమె
యకలంక దయాసముద్రు । డవుగద హనుమా! ॥ (53)

కం॥ శ్రీరాముని పై భక్తియు
పారావారంబు గలుగు । టదియెటు లబ్బున్
వీరాంజనేయ దెలుపుము
యా రాముని దలచి ముక్తి । నందెద హనుమా! ॥ (54)

కం॥ ఎంతమొఱ జెప్పుకొన్న, నొ
కింతయు మాటాడ వైతి । మిదియే మయ్యా!
సంతతము నీకు దాసుడ
పంతము విడనాడి యిపుడె । బలుకుము హనుమా! ॥ (55)

కం॥ నీవీ మౌనము నుండకు,
మా! వద్దని వేడుచున్న । మామొఱ వినవా?
నీవే బలుకక యుండిన
కావంగల వారలెవరొ? । గనుమో హనుమా! ॥ (56)

కం॥ నీకమిత భక్తి గలదుర
నాకుప కారమును జేసి । నన్, నిను విడరా!
నాకిపుడే జూపు రాముని
చేకురు సత్కీర్తి నీకు । శీఘ్రమె హనుమా! ॥ (57)

కం॥ రణమున మూర్ఛబడిన,ల
క్ష్మణునిం బ్రతికించినావు । సంజీవని చే
గణుతింప తరముగాని, ని
పుణతకు శ్రీరాము డపుడు । బొగడెను హనుమా! ॥ (58)

కం॥ శ్రీరాముడు సంతోషము
దీరగ నిను గౌగిలించి । దీవించియు నో
వీరా! నిను భరతునివలె
చేరుచు కొనె పుణ్యమేమి । జేసితొ హనుమా! ॥ (59)

కం॥ ఘనమగు రాముడు దాసుడ
వని, ప్రేమను నిన్నుజూచు । టది భాగ్యమురా!
నను నీదాసులలో నొక
డనుకొని దయచూడు మంటి । నరయము హనుమా! ॥ (60)

కం॥ నీ మాహాత్మ్యము గొప్పది
స్వామీ! వీరాంజనేయ! । సదయహృదయ నీ
నామ స్మరణము జేసెద
కామాద్యరులను వధించు । ఘనుడవు హనుమా! ॥ (61)

కం॥ నీమీది కోర్కె వదలదు
యే"మంద"ది రాసినావొ? । యేమో యెరుగన్
నామానసమున రాముని
నామంబు దలంచు చుందు । నాదొర హనుమా! ॥ (62)

కం॥ అనుదినము రామనామం
బను నమృతము గ్రోలి క్రోలి । యానందంబై
తనువు మరచియును మోక్షం
బును గోరక భక్తి లోన । మునిగిన హనుమా! ॥ (63)

కం॥ రాముని నామా మృతమున
కేమిరుచియొ? యేమిమధుర । మెఱిగింప వయా
నామది నువ్విళ్లూరుచు
నా మధురము గ్రోలి దృప్తి । నందెద హనుమా! ॥ (64)

కం॥ ఏమని చెప్పుదు నామది
రాముని దర్శనము గోరె । రా! యేమనెదో?
నామది తృప్తిగ జూచెద
రాముని జూపించు నాకు । రయమున హనుమా! ॥ (65)

కం॥ నీదాస దాసుడను, నే
గాదా! కఠినంబు జేయ । గాదగ దయ్యా
వాదా? నాతో నీకును?
రాదా! దయ నన్ను బ్రోవ । రావా? హనుమా! ॥ (66)

కం॥ ఎందరు గలరో? దాసులు
నందరిలో నన్ను నొక । డనుకొన రాదా?
సందియ మందక రాముని
సుందర రూపమును నాకు । జూపుము హనుమా! ॥ (67)

కం॥ నీదయ లేకను రాముని
కేదయ రాదనుచు నాకొ । కింతయు దెలియున్
కాదనకును రాముని, నా
మోదముతో జూపు నీకు । మ్రొక్కెద రామా! ॥ (68)

కం॥ నామీద నీకు ప్రేమని
యేమాత్రము నడుగ యెవరి । నెప్పటికే నిన్
స్వామీ! నాహృదయంబున
రామా యనిదలచు చుందు । రావే హనుమా! ॥ (69)

కం॥ ఎప్పుడు నీకృప గలిగిన
యప్పుడె నే వ్రాయుచుండి । యడుగుచు నిన్నే
తప్పులు నొప్పులు దెలియవు
చెప్పిన పని ప్రేమచేత । జేసితి హనుమా! ॥ (70)

కం॥ శ్రీరాముని నామంబును
నూరూరను దేశమంత । నున్నది యెపుడో
రారా నీదయ చేతను
నారాముడు నిండె జగము । నంతట హనుమా! ॥ (71)

కం॥ నూతనమైన రహస్యము
చేతను నిన్నడుగు చుంటి । చెప్పుము నీవే
నాతను వశాశ్వతము గద
సీతారాములను జూపు । శీఘ్రము హనుమా! ॥ (72)

కంII తేపకు తేపకు రాముని
జూపుముజూపుమని యడుగు । చుంటిని,గానా
కాపరమాత్ముడు వినునా?
యాపని నెరవేరు టెటుల । ననకుము హనుమా! ॥ (73)

కంII రామాజ్ఞను తలదాల్చియు
నేమముతో పనులు సేయ । నినుప్రేమించున్
నీమాటను జవ దాటను
రామయ్యను నాకుజూప । రాదా హనుమా! ॥ (74)

కంII రాముని తత్వ మెఱిగితివి
రామునిపై నీకుభక్తి । రా యెప్పటికిన్
రామ జపా నందంబున
రామునిలో నీదుమనము । లయమగు హనుమా! ॥ (75)

కంII చందనమలం కరించియు
విందులు పక్వాన్నములను । వినయము తోడన్
ముందర నైవేద్యము నిడి
వందనములు జేయ బ్రోచు । వాడవు హనుమా! ॥ (76)

కంII నావంతు నీదు పదముల
సేవించుట నీదుపూజ । జేయుట యెపుడున్
గావించుట నీస్మరణము
నీవంతే నన్ను గావ । నిరతము హనుమా! ॥ (77)

కంII ఈతనువు బుద్ధి హీనత
చేతను గలిగిన దటంచు । చెప్పిరి పెద్దల్
ప్రీతిగను సద్బుద్ధిని దయ
చేత నొసగి బ్రహ్మవిదుని । జేయవె హనుమా! ॥ (78)

కం॥ దుష్టుల హతమొన రించియు
శిష్ట జనుల ప్రేమ మీర । శీఘ్రముగా సం
తుష్టులగు నటుల జేయుచు
కష్టములం బారద్రోలు । ఘనుడవు హనుమా! ॥ (79)

కం॥ బాలదశయందు ఋషులను
జాలగ బాధింప వారు । శాపమి డుటనీ
వాలబల పరాక్రమ ములు
నీలోపలి శక్తి దెలియ । నేరవు హనుమా! ॥ (80)

కం॥ నీతనువు వజ్ర మగుటను
చేతను వజ్రమును ధరించి । చిద్రూ పుడవౌ
నీతేజము నీ బలమును
చేతనులకు దెలియ వశమె । చిన్మయ హనుమా! ॥ (81)

కం॥ నీవే రామ భవనమును
గావన్ ద్వారముననుండి । కడు జాగ్రతతో
త్రోవ విడువు లోపలికిని
నీవాడను నన్ను బోవ । నీయుమ హనుమా! ॥ (82)

కం॥ ఎన్నో జన్మల వాసన
లన్నియు మరిపింప శక్తి । యది నీయందే
యున్నది నాకున్ దయతో
ఎన్నడొ సంగెదవొ జెప్పు । యిప్పుడె హనుమా! ॥ (83)

కం॥ నిను భక్తిని బొగడినచో
వినినంతనె దనువు మరచి । ప్రేమా ధికమై
ఘనమౌ కాంక్షలు కూర్తువు
దనయునివలె జూతువయ్య । దయగల హనుమా! ॥ (84)

కం॥ నామనము లోన జేరుము
కామములను గోరనీక । కడు జాగ్రతతో
రామ జపము జేయించుము
రాముని జూపించు నాకు । రవినుత హనుమా! ॥ (85)

కం॥ వినుమా నీదగు జననం
బునునే వినియుంటి నదియి । పుడువచి యింతున్
మునుపు పరాశర సంహిత
యనుకబ్బ ములోన నున్న । దదియే హనుమా! ॥ (86)

కం॥ మును మైత్రేయుడు నీదగు
జననంబును నడుగ దలచి । సవినయముగ,నా
మునియగు పరాశరునితో
హనుమని జననంబు జెప్పు । మనెనో హనుమా! ॥ (87)

కం॥ అనుటను పరాశ రుండును
ముని మైత్రేయునికి జెప్పె । మోదము తోడన్
వినుమదె నీకును జెప్పెద
ననుమానము జేయకయ్య । యజనుత హనుమా! ॥ (88)

కం॥ పరమేశ్వరుడును పార్వతి
సరసోక్తుల నాడి రతియు । సల్పుచు నుండన్
హరుతేజము నా పార్వతి
ధరియింపగ లేక చాల । తడబడె హనుమా! ॥ (89)

కం॥ ఆతేజ మగ్ని కిచ్చిన
నాతడు వాయువున కొసగె । నతి వినయముగా
నేతాళ జాల ననుచును
భూతలమున నపుడు వెదుక । పొడగనె హనుమా! ॥ (90)

కం॥ కేసరి పత్నియు నంజని
వేసట జెందకను తపము । విధి యుక్తముగా
జేసెను పుత్రుని బడయగ
నాసమయము జూచి వాయు । వప్పుడు హనుమా! ॥ (91)

కం॥ వచ్చియు తేజము ఫలమని
యిచ్చిన నది దినగ గర్భ । మేర్పడె నపుడే
నచ్చెరు వందుచు, నంజని
వచ్చెను నపకీర్తి యనుచు । భయపడె హనుమా! ॥ (92)

కం॥ ఆకాశ వాణి బల్కెను
నీకేమి భయంబు లేదు । నీ గర్భమునన్
లోకోద్ధారుడు పుత్రుడు
నీకుద్భవ మొందు నిదియె । నిజమనె హనుమా! ॥ (93)

కం॥ శనివారము వైశాఖము
ననుబహుళ మజైక పొత్తు । నన్ నైధృతితో
డనుదశమి నాడు నంజని
నినుగనె మధ్యాహ్నమునను । నిజముగ హనుమా! ॥ (94)

కం॥ ఇది నీ జయంతి యనగా
నిది పుట్టిన దినమటంచు । నెందరొ భక్తుల్
ముదమున నీదు మహోత్సవ
మదినీ ప్రియమనుచు జేతు । రందరు హనుమా! ॥ (95)

కం॥ జపములు, పూజలు, హోమము
లపరిమితము లన్నదాన । మన్నివి ధములన్
కృపగన భసనలు హరికథ
లపుడు ప్రసాదము గ్రహింతు । రందరు హనుమా! ॥ (96)

కం॥ అమ్మా యాకలి యయ్యెను
యిమ్మా యేదైన ఫలము । యిప్పుడె యనగా
సమ్మతితో నంజని యనె
కమ్మని ఫలమిత్తు నీకు । గొనమనె హనుమా! ॥ (97)

కం॥ అనగనె మీదికి జూచితి
గనబడెనట సూర్యబింబ । కాన్తి ఘనంగా
మినుముట్ట యెగిరి పండను
చునుమ్రింగితి నీదుమహిమ । చోద్యమె హనుమా! ॥ (98)

కం॥ పండని భానుని మ్రింగిన
దండి పరాక్రమము గొప్ప । ధైర్యము గనుచున్
మండిపడి నింద్రు డపుడే
చెండెను వజ్రా యుధమున । చెంపను హనుమా! ॥ (99)

కం॥ అపుడే మూర్ఛను నొందితి
తపతప తలగొట్టు కొనుచు । తల్లియు నేడ్చెన్
కుపితుడై తండ్రి వగచెను
నపరాధ మదేమిపుత్ర । కాయని హనుమా! ॥ (100)

కం॥ ఇపుడే మూర్ఛను బొందిన
కపివరుసుతు గాంచిగాలి । కడు కోపముతో
నపకారు డింద్రుడని యటు
లపుడందరి లోన ప్రాణ । మాపెను హనుమా! ॥ (101)

కం॥ వాయువు లేకుం డుటచే
వేయి కనులవాని మొదలు । వేల్పులు దమలో
చేయునది లేక నందరు
బోయిరి పరమేష్టి కడకు । మూల్గుచు హనుమా! ॥ (102)

కం॥ సురులును ఋషులును గలిసియు
నరిగిరి పరమేష్టి గలిసి । యందరు గూడిన్
గిరిజాపతి విష్ణులగని
పరమూర్తిని వేడువారు । పరుగిడి హనుమా! ॥ (103)

కం॥ పరమేష్టి విష్ణు రుద్రులు
కరుణించియు దేవతలును । గలిసియు వేగన్
ధరిణిని మూర్ఛను బొందిన
వరసుతునిన్ నిన్ను జేర । వచ్చిరి హనుమా! ॥ (104)

కం॥ పావని నిను గనుగొనుచును
శ్రీవిష్ణువు దేవతలును । చిత్తము లోనన్
భావించి యనుగ్ర హించిరి
దీవెనలను నిచ్చి రిట్లు । దెలిపెద హనుమా! ॥ (105)

కం॥ ఓవాయు దేవ నీసురు
డీవిశ్వము లోన ఘనుడు । యెప్పుడు వీడున్
జీవించి యుండు వాడని
దేవతలును త్రిమూర్తు లనిరి । తేటగ హనుమా! ॥ (106)

కం॥ వచ్చిన దేవత లందరు
నిచ్చ ప్రకారమున వరము । లిచ్చియని రటుల్
యచ్చెరు వందకు మాబల
మిచ్చితి మందరము నీకు । నిపుడే హనుమా! ॥ (107)

కం॥ ఆదరి లోపల వాయువు
పొందికతో నిలిచి సురలు । బోయిరి దివికై
యందరి వరముల నాశల
బొందిరనుచు వాయువపుడు । పొంగెను హనుమా! ॥ (108)

కం॥ అనియీ విధమున మైత్రే
యునకు పరాశరుడు జెప్పె । యోపిక తోడన్
ఘనమగు నీకథ నీకును
వినిపించితి నన్ను గావు । వేగమె హనుమా! ॥ (109)

కం॥ ధర హూణశకము కథసుధ
సరియగు శ్రీ కాళయుక్తి । సంవత్స రమున్
పరమాఘ శుద్ధపంచమి
వరకీ శతకము రచించ । బడెనో హనుమా! ॥ (110)

కం॥ మృదుమధుర సులభ శైలిని
ముదమొప్పగ కంద పద్య । ములతో శతక
మ్మిది నీకు సమర్పించితి
సదయహృదయ గొనుము దీని । జయ శ్రీహనుమా! ॥ (111)

కం॥ లోకమున నెవ్వరైనను
నీకథ నీశతక కృతిని । పఠించిన వినినన్
కరుణించును రాముడు దా
నీకపి నాథుండు కోర్కె । లిచ్చును హనుమా! ॥ (112)

*****

## -:చందనాలంకార కథ:-

కం॥ సింధూర మద్దవలెనని
యందురు జనుల్లె నెపుడు । హనుమం తునిపై
యెందుకు పెట్టగ వలెనను
సందియమును బాపునట్టి । సత్కథ నిదియే ॥

కం॥ హనుమంతుడొక్క సమయం
బున రాముల సేవజేయ । బుద్ధి నొడమినన్
మనమున రాముని దలచుచు
జని యనియెను వినయము నను । జక్కని భక్తిన్॥

హ॥ సీతారాముల, మిమ్ముల
ప్రీతిన్ సేవింప వచ్చి । వేడితి నయ్యా!
చేతనులందర బ్రోచెడి
దాతవు నీదాస దాస । దాసుడ నయ్యా ॥

రా॥ భూతాళి సృష్టికీమెయె
నూతన మార్పులను జేయ । నోవును గానా
సీతాజ్ఞ తీసికొనిరా!
రా తాళుము తీవ్రపడకు । రాహను మయ్యా! ॥

హ॥ నేనపు డంటిని రామా!
జానకి కేవశ్య మగుట । చాలా చోద్యం
జానకి జేసిన తపమా!
వీనుల పండుగవును దెలుపు । వినెదను రామా! ॥

రా॥ సీతా వివాహ సమయము
సీతకు పాపెటను బెట్టు । సింధూ రముకై
సీతకు వశమై పోయితి
ప్రీతిగలిగె సీతమీద । వినుమా హనుమా॥

కం॥ అనగనె వినిహను మంతుడు
మనమున నుప్పొంగి తాను । మదిలో దలచెన్
మనమగు రాముడు వశుడౌ
ననితొందర పడుచు జనియె । నతి వేగమునన్ ॥

కం॥ అపుడే త్వరలో వెళ్లియు
విపులపు సింధూర లేప । విహితాం గుండై
యపరిమితా నందుడవై
కృపగల శ్రీరాము కడకు । నేగితి వయ్యా ॥

హ॥ కుటిలము లేకను బలుకుము
చిటికెడు సింధూ రమునకు । సీతకు వశమై
నటు, నాకు వశము గావా?
యిటుగను సింధూర తనువు । నిప్పుడు రామా! ॥

రా॥ సీతా రాములు నిద్దరు
వాతాత్మజు జూచినంత । పంపక నగుచున్
నీతంత్ర మునకు మెచ్చియు
ప్రీతిగ వశమైతి మేము వినుమా హనుమా! ॥

కం॥ అనగనె గంతులు వేయుచు
హనుమంతుడు నింగిపొంగి । నతివేగ ముతో
వినుతించి దనువు మఱచియు
కనులను నానంద భాష్ప । కణములు రాల్చెన్ ॥

హ॥ రామా నాహృద యకమల
ధామమునకు సీతతోడ । దర్శన మిడుచున్
స్వామీ సతత మ్ముండుము
నామదిలో నీదుదివ్య । నామము దలతున్ ॥

రా॥ లోకములో నెవరైనను
నీకును సింధూర మలది । నిను పూజించన్
నాకా నందంబై నే
నే కోరిక లైన వారి । కిత్తును హనుమా ॥

రా॥ నీపూజ సలుపు వారిని
కాపాడెద గరుణ తోడ । కలియుగ మందున్
నీ పూజయె నాకిష్టము
దాపును నిడకుండ నుందు । దప్పక హనుమా ॥

## -:శని, ఆంజనేయుల సంభాషణ:-

శ॥ శని హనుమని గనియిటులనె
వనచర ననుదెలు సుకోర । బహుబల శూరా!
శనియన నెవరను కుంటివి
శని దృష్టిని బడిన నీవు । చత్తువు హనుమా! ॥

హ॥ శనిగా హనుమం తుండన
వినవా? యెప్పుడును నీవు । వీనుల నిండన్
ఘనుడను గర్వము నుడుగగ
ధనుజుల మర్ధించి నటుల । దండిం తునురా॥

శ॥ వనచర నే భయపడరా
కొనకొమ్మల దుముకు చుండు । కోతివి గదరా
ననునేమి జేసెదవురా
కనబడకను నిన్నుబట్టి । కడదే ర్చెదరా ॥

హ॥ కనబడనని యనుకొనకుము
నినుగనియెడు నేర్పుగలదు । నిను బోనివరా
వనజభవుం డెదిరించిన
వినరా బంధింతు నిన్ను । వేగమె సౌరీ ॥

శ॥ మొదటను నా దృష్టిబడిన
కదలక మెదలకనువాడు । గడు భయమొందున్
ముదమున బట్టుకొని యెదను
నది మొదలుగ వాని కెపుడు । నాపద లొదవున్ ॥

హ॥ ఎటులు న్నావుర నల్లగ
కుటిలమతీ కుంటివాడ । క్రూరుడ వౌనీ
వెటు నూనె బూసికొంటివె,
యెటులన్నను బట్టుకొనెదొ? । యెరిగింపు శనీ ॥

శ॥ విను దెల్పెద దేవతలను
మనుజుల నసురులను బట్టి । మర్దిం చితిరా
నిను నే జయించి వెళ్లెద
నని వచ్చితి సిద్ధమైన । యపుడే హనుమా ॥

హ॥ ఎపుడో వచ్చుట జెపితే
యపుడే నే సిద్ధమౌదు । ననుకొనుము శనీ!
యపుడసుర సురల గెలిచితి
నిపుడే నీగర్వ మడుతు । నిదిగో రారా! ॥

శ॥ చెప్పెద నినునే బట్టిన
తప్పక శిరమందు దుమికి । దండిం చెదరా
దప్పించు కోర నిప్పుడు
జెప్పుచు నీశిరము నందు । జేరితి హనుమా ॥

హ॥ మంచిగ కూర్చుండుమురా
కొంచెము సేపాగు నీదు । కోర్కెన్ దీర్తున్
బెంచి దనువు పెద్దగిరిని
నుంచెను శని శిరము మీద । యుక్కున్ దక్కన్ ॥

శ॥ అన్నా జచ్చితి నంచును
గొబ్బున నేడ్చుచును వాడు । కుయ్యో యనుచున్
దబ్బుఱ లాడెను నికనా
మబ్బు వదిలె నన్ను బ్రోవు । మా హనుమయ్యా ॥

శ॥ తీయుము పర్వత మయ్యా!
నీయాజ్ఞను నడతు నెపుడు । నీదయ చేనా
మీ యాపద దొలగించక
జేయవయా! గావుకావు । శివశివ హనుమా! ॥

హ॥ ఓరీ శనినే జెప్పెద
మారాముల దాసుకులను । మాభక్తులు, నీ
వారము ననుపూ జించెడి
వారిని దలనెత్తి జూడ । వలదుర సౌరీ ॥

శ॥ అటులనె నడచెదనయ్యా!
కుటిలము లేకుండ నిన్ను । గొలిచెద నయ్యా
యెటుల భరింతును పర్వత
మటు ద్రోయుము నీకుదండ । మయ్యా హనుమా! ॥

హ॥ తీసితి పర్వత మిపుడే
దాసుడవై యుండు మెపుడు । దలయెత్తకు నీ
కోసము ననుపూ జింతురు
మోసము జేయకను విడచి । పోరా సౌరీ ॥

శ॥ అనవిని శని యోహనుమా!
నను రక్షించితివి నీకు । నావంద నముల్
గొనుమయ్య బోయి వచ్చెద
నను దయతో జూడవయ్య । నాదొర మనుమా ॥

కం॥ అందుకొరకె శనివారము
నందున సింధూర మలది । యర్చన సలుపన్
పొందుగ గారెల పేరులు
విందు సమర్పించు వారి । విడననె హనుమా! ॥

కం॥ గ్రహచా రంబును జాలక
బహురోగము లున్న చెడిది । బాధల పడుచో
నిహపరము లచ్చుచున్ భువి
సహకారము జేసిజనుల । సంర క్షించన్ ॥

కం॥ ఈకథ జదివిన, వ్రాసిన
సాకల్యము విన్ననేని, చల్లగ జూచున్
శ్రీకపి వరుడగు హనుమడు
లోకంబున బాధలన్ని । లోగొని సతమున్ ।

## -: సువర్చలా జననము :-

కం॥ వినుము సువర్చల జననము
మును మైత్రేయుండు నడుగ । ముదము దలిర్పన్
వినిచెను పరాశరుడు దన
మనమున కౌతుకము గదుర । మైకొను హనుమా ॥

కం॥ మును విశ్వకర్మ పుత్రీ
మణి ఛాయను భవ్య దివ్య । మధురా కృతిదా
గని పెండ్లి జేసె సూర్యున
కును, నాతని వేడికోర్వ । కునికి వినంతన్ ॥

కం॥ తల్లికి జెప్పెను ఛాయయు
తల్లియు తనభర్త తోడి । దడయక జెప్పన్
వెల్లివిరియ పేరిమి, ద
ద్వల్లభుడటు జేతుననియె । వారికి నపుడున్ ॥

కం॥ అనె భార్యతోడ నప్పుడు
వినుమా రవికిర ణమునకు । వేడి దరుగున
ట్లునజేతు  ఛాయ యెపుడును
పెనిమిటితో నుండునటుల । ప్రేమ దలిర్పన్ ॥

కం॥ ఆవిశ్వకర్మ సూర్యుని
కేవల బింబంబు సాన । గీలించి దగన్
గా, వెడలించెను తేజము
నా వెలుగు సువర్చలాఖ్య । యంత జనించెన్ ॥

కం॥ ఆకన్యా సౌందర్యము
లోకుల మైకమున ముంచి । లోలత గూర్చెన్
గాక, మరిదగిన వరుడెవ
డోకదయని సురలు జాల । నుత్సాహము తోన్ ॥

కం॥ పవనాత్మజ నీతో సరి
యవనిని వెదికినను లేరు । యచ్చెరువున నీ
వలీల నేర్చు కుంటివి
యువిద సువర్చల నునిత్తు । నొప్పుగ గొనుమా! ॥

కం॥ అనుచు సువర్చల గూతును
హనుమంతుని కిచ్చి పెండ్లి । యప్పుడె జేసెన్
వినయముగ సువర్చలతో
హనుమంతుని సాగనంపె । యార్కుడు సౌరీ ॥

కం॥ జనులు సువర్చల గూడిన
హనుమంతుని పూజసేయ । నప్పుడు ముదమున్
గనినిచ్చు వరము వారికి
ననియు పరాశరుడు జెప్పె ।  యామౌని వినన్ ॥

కం॥ ముని మైత్రేయుడు వినుచును
ఘన సంతోషమున మునిగి । గడువిన యముతో
డను నా పరాశరుని గను
గొని వందనములును జేసె । కూర్మిని హనుమా! ॥

కం॥ ధరణి కరీంనగర మునను
కరుణించియు సర్వజనుల । కాపా డుటకున్
సిరియును, బలమును, యశమును
వరము లనేకముల నిచ్చు । వాడవు హనుమా! ॥

కం॥ చక్కెర నగర నివాసుల
మక్కువతో బ్రోచునట్టి । మారుతి తనయా!
మ్రొక్కెద సతతము భక్తుల
ప్రక్కననుండుచును వేగ । పాలించుమురా॥

## -: శివుడేహనుమంతుడగుట :-

కం॥ శివుడే హనుమంతుండై
యవతారము దాల్చినట్టి । యాకథ నిపుడున్
సవినయముగ దెలిపెద విను
పవనాత్మజ బ్రోవు రామ । భక్తా హనుమా! ॥

కం॥ వినిన కథను వివరింతును
మును కాలాసురుడు శివుని । ముందర తపమున్
తనువు మరచియును జేసిన
ననయము శవుడిచ్చె వరము । లన్నియు హనుమా! ॥

కం॥ వరగర్వము చే కాలుడు
నరుల, ఋషుల, దేవతలను । నానా బాధల్
బరపిన దేవత లందరు
నరిగిరి త్రిమూర్తుల వేడ । నపుడే హనుమా! ॥

కం॥ వినుడో త్రిమూర్తు లారా
ఘనవర గర్వమున వచ్చి । గాలా సురుడున్
వనజాసను నెదిరించెను
యని వీనిం జంపు వార । లవనిని గలరా ? ॥

కం॥ అవనిని లేరా? జంపుట
కెవరైనను వాని, బలమ । దేమి విచిత్రం
బవురా విష్ణుడ నుంటిని
యవలీలగ జంపివైతు । ననెవో హనుమా! ॥

కం॥ అనె శివుడు తీవ్రపడుచును
ఘనుడగు గాలుని వధింప । గానే నీకున్
పనిచేయు బంటు నగుదును
నిను మోసెద భుజములందు । నిజమిది హనుమా! ॥

కం॥ తను మోహినియై విష్ణువు
ఘనుడగు నాకాలు గాంచ । ఘలుఘలు మనుచున్
తనపద ములతో నాట్యము
మునుముందర జేయువాడు । ముదమున హనుమా! ॥

కం॥ కనె కాలుడు మోహిని నపు
డును మోహభ్రాంతి తోడ । నున్మ త్తుండై
తనుమరచి యున్నవానిని
దునిమెను చక్రమున చక్రి । దోర్బల హనుమా! ॥

కం॥ కాలా సురుని వధించుట
చాలా చోద్యంబు జూచు । జనులం దరికిన్
మేలయ్యె ననుచు నిర్జర
జాలాదులు సంతసించి । చనిరట హనుమా! ॥

కం॥ శివుడు ప్రతిజ్ఞ నిలుపుటకు
నవతారము దాల్చెనిపుడు । హనుమంతుండై
భువిరామ వాహనంబై
యవలీలగ మోసి బంటు । వైతివి హనుమా! ॥

కం॥ శివు డాంజనేయు డగుకథ
భువిలో జనులెల్ల జదువ । పుణ్యము చేతన్
శివ విష్ణు భేదముండదు
పవమాన సుతుండు తాను । ప్రత్యక్ష మగున్ ॥

కం॥ హనుమంతుని సేవించిన
ధనధాన్యము లొసగి తాను । దాపును విడకన్
ఘనమైన కోర్కె లొసగును
మనుజుల పోషించు చుండు । మహిలో సతమున్ ॥

*****

# శ్రీ చెన్నకేశవస్వామి శతకము


| | | |
|---|---|---|
| రచయిత | : | బ్రహ్మశ్రీ రామకరామశర్మ |
| గ్రామము | : | మన్నెంపల్లి, మం. తిమ్మాపూర్<br>జి. కరీంనగరము., రా. తెలంగాణ |
| తొలిముద్రణ | : | 12-12-1977 |
| ద్వితీయముద్రణ | : | జనవరి 2020 |
| అక్షరాలంకరణ | : | శేషం వేణుగోపాలశర్మ |
| ముద్రణా సౌజన్య ప్రదాత | : | గంగవరం నారాయణశర్మ<br>బోధన్,ఇందూరు |

# "ఓమ్ శ్రీ లక్ష్మీ చెన్నకేశవ పరబ్రహ్మణే నమ:"

శా॥ శ్రీవైకుంఠ పురమ్ము నుండి యిటకున్ శ్రీభూమి నీళాసతుల్
సేవింపంగ సుపర్ణ వాహనుడవై శీఘ్రంబుగా వచ్చి, యు
న్నావా? మన్నెముపల్లి కోవెలను నో నారాయణా మాకిదే
శ్రీవైకుంఠము మోక్షధామమిదె మా చిత్తంబు లో కేశవా! ॥ (01)

మ॥ వరదా! విఘ్నము గల్గజేయకుమ, విష్వక్సేను పూజింతు,నా
యురమందుండియు వాక్పటుత్వమును నాకుత్సాహ మొందింపుమా!
హరిపై భక్తిగ వ్రాయు పద్యములకున్ హర్షంబు గల్గింపు, శ్రీ
ధర! సాష్టాంగ నమస్కృతుల్ సలిపెదన్ ధర్మాత్మ యో కేశవా! ॥ (02)

ఉ॥ భక్తుల బ్రోవరా! కరుణ భావము తోడుత వచ్చి వేగమే
ముక్తుల జేయ నీకుసరి బోలెడు దైవ మికెవరయ్య? నా
సక్తిగ నన్ను బిల్చితిని జాగొన రింపక రాగదయ్య, నీ
భక్తుడ నన్ను గావగల భర్తవు మన్నెము పల్లి కేశవా ॥ (03)

ఉ॥ శ్రీరమణీ మనోహరుని, శ్రీధరణీశుని, చిత్స్వరూపునిన్
ఘోరప్రతాప శూరుని, సుకోమల గాత్రుని, సచ్చరిత్రునిన్
వారిజ నాభునిన్, భువనపాలన శీలుని, సత్కృపాళునిన్
సూరి జనాళిసేవ్య నిను జూచితి మన్నెము పల్లి కేశవా! ॥ (04)

ఉ॥ శ్రీధర! నీపదాబ్జముల చిత్తము నిల్పిన నిల్వదయ్య, యో
సాధుజనావనా! సుజనసన్నుత! నామదినిల్పి సంవృతిన్
బాధలు బాపు నిన్ను నెడబాసియు తాళగ జాలనయ్య, యో
మాధవ! నిన్భజించెద రమావర! మన్నెము పల్లి కేశవా ॥ (05)

ఉ॥ బమ్మెర పోతరాయనిదె భాగ్యమె భాగ్యము నీదు సత్కృపన్
కమ్మని పద్యముల్ విరివిగా రసవంతము గాగ జెప్పె, సీ
తమ్మకు తమ్ముడా! యతడుదారము తో కవిధారనివ్వ, నే
నమ్మితి నీపదాబ్జములు! నాకటు లీయవె? చెన్నకేశవా! ॥ (06)

ఉ॥ కానగరాని వాడ, కడుగారడి విద్యల జేర్చినాడ, యో
మానము లేనివాడ, యభిమాన మెరుంగని వాడ వెప్పుడున్
మౌనము నుండువాడ! దినమానము దిర్గెడువాడ! సాధులన్
దీనుల గాచువాడ! రణధీరుడ! మన్నెము పల్లి కేశవా! ॥ (07)

ఉ॥ వీనులు లేనివాడ, పలు వీనులవిన్ చెడు నట్టివాడ, య
జ్ఞానము లేనివాడ, తొలి జ్ఞానమె రూపము నైనవాడ, సం
తానము గల్గువాడ విశదంబగు సంతతి నేలువాడ, నీ
వేనను బ్రోచువాడ నని వేడితి మన్నెము పల్లి కేశవా! ॥ (08)

మ॥ నినునే ధ్యానము సేయువేళ మనము న్నిల్పంగ లేనెప్పుడున్
వినయంబేమి నెరుంగలేను నిలలో విద్వాంసుడంగాను, మీ
కనుకూలం బగు వేదసూక్తము లచే నారాధన ల్జేయలే
ననురాగంబున వచ్చి బ్రోవుమిపుడే యార్తావనా! కేశవా! ॥ (09)

ఉ॥ ఆర్తుల నేలువాడ! వెపుడాశ్రిత వత్సలు డైనవాడ, నా
కర్తవు నీవెజూడ, యపకారుల రూపము మాపువాడ, స
ద్వర్తన జూచువాడ, కడుదారము తోడుత బ్రోచువాడ, వే
మూర్తుల చిత్స్వరూపముల మూలము మన్నెముపల్లి కేశవా!॥ (10)

ఉ॥ శాంతుడు, శేషశాయి, కలుషంబు లడంచెడు వాడు, విజ్ఞతా
శ్రాంతుడు, సర్వశేషి, సరసన్ను డచ్యుతు, డాది శేషు,డే
కాంతుడు, శ్రీనివాసుడు, సుగాన విలోలుడు, కర్మసాక్షి, శ్రీ
కాంతుడు, విష్ణుభక్తులను గాచెడు మన్నెముపల్లి కేశవా! ॥ (11)

ఉ॥ మచ్చికతోడ నీడ కను మా హృదయాబ్జము లందునుండి మా
కచ్చపు భక్తినిచ్చి భవ కాననము న్దహియింప జేసి, మే
మిచ్చిన పూలు పండ్లెపుడు నిష్టము తోడగ్రహించి భక్తికి
న్మెచ్చియు మమ్ము నేలితివి మీదయ తోడుత చెన్నకేశవా! ॥ (12)

ఉ॥ వచ్చెదువాడ దీనజన వార్త వినంగనె నిల్వకుండనే
యిచ్చెదువాడ భక్తులకు నేమియు కోరిన కోరకుండి,ని
న్నెచ్చట దిర్గిచూచినను యెవ్వరు నీసరి వారు లేరు నీ
యిచ్ఛప్రకారమే జరుగునెప్పుడు మన్నెముపల్లి కేశవా! ॥ (13)

చ॥ పిలిచిన వచ్చువాడనెడు పేరులబించెను స్వార్థమేమి, నే
పిలిచిన రావదెందుకని పెద్దతనంబున కేమి భంగమౌ
తలచెద నిన్ను దాసుడను దర్శనమిచ్చిన నీకె కీర్తి నా
కిలయెవరయ్య దిక్కు? నను నేలుము మన్నెముపల్లి కేశవా!॥ (14)

చ॥ అడిగిన కోర్కెలిచ్చెదవు నాశ్రితులై నిను సంస్తుతించినన్
అడుగక నామసంస్మరణ మార్తిగ జేయుచు దిక్కునీవె నిన్
విడువను నీదుభారమున వెంటనె దిర్గుచునుండి యెప్పుడున్
జడియకు నాదె భారమని సాకెడు మన్నెముపల్లి కేశవా! ॥ (15)

ఉ॥ అంతటనుండి యీజగము లన్నియు నేలుచు నుండునీకు వి
శ్రాంతిని గల్గియుం డుటకు చక్కని ధ్యానపు పుష్పశయ్య నే
కాంతము నాహృదబ్జమున కల్పన జేసితి సమ్మతించి శ్రీ
కాంతయు నీవునిద్దరును కమ్మని నిద్దుర వొందు కేశవా! ॥ (16)

ఉ॥ పంకజలోచనా! పతితపావన! యోవనమాలి! కార్ష్ణా!
సంకటమోచనా! సజనసన్నుత! సంతత విశ్వ పాలనా!
శంకర సన్నుతా! విధివశంకర! శ్రీధర! పంకజోధరా!
వేంకటనాయకా! విజయ వీరపరాక్రమ! చెన్నకేశవా! ॥ (17)

ఉ॥ సన్నుతి జేయుచుంటి భవసాగర మీదక రాకయుంటి యో
పన్నగశాయి యంటి నినుపాలన జేయగ రమ్మనంటి నా
కున్నవు నీవెయుంటి తనువుండగ దర్శన మీయుమంటి నే
నిన్నె భజించుచుంటి కరుణించుమ మన్నెముపల్లి కేశవా!॥ (18)

శా॥ ఉన్నాడా భగవంతుడెప్డు వినరా, వుంటేల రాడాయెరా?
యున్నాడొక్కడు నార్తితో బిలువరా! యాద్రౌపదిన్ బోలగా
నన్నా, నిప్పుడె బుద్ధివచ్చినది నాయజ్ఞానమున్ బోయినా
దన్నా, నిప్పుడె బ్రోచువాడవు గదా యాపన్ను లన్గేశవా! ॥ (19)

చ॥ కరముల దక్షిణార్ధమున కంబువు నున్నభయైక హస్తమే
యిరువుగ వామబాహువుల నెప్పుడు చక్రగదా ధరుండవై
యురమున శ్రీ ధరించి కరమొప్పగ శ్రీపృథివీ సమేతుడై
ధరణిని యాదిమూర్తి యవతారము మన్నెముపల్లి కేశవా! ॥ (20)

ఉ॥ ఆగజరాజు నేలితివి యాయవతారము నీవెగాన నీ
వేగతి నిన్ననమ్మితిని వేడితి చిన్నతనంబు నుండి యు
న్నీగుడిలోన నిత్యమును నీ భజనంబును జేయుచుంటిరా
వేగమె వచ్చినాకు గనిపించుము మన్నెముపల్లి కేశవా! ॥ (21)

చ॥ పరుగిడి వచ్చుచుండెదవు భక్తుల పిల్పును విన్నయంతనే
మురియుచు వారిజూచుచును భూరికృపారస ముప్పతిల్లగా
నరమరజేయ కుండగను నాపదలన్నియు బారద్రోలు, చు
న్వరములనిచ్చు ప్రేమగలవాడవు మన్నెముపల్లి కేశవా! ॥ (22)

చ॥ సిరిగలవాడ వీవనుచు చేరితి నీచరణాబ్జ సన్నిధిన్
వరముల గోరగా నితర వాంఛలు నాకెవి లేవుగాని మీ
పరమపవిత్ర నామరస పానము జేసెడి బుద్ధినిమ్ము, న
న్మరువకు నీకు మ్రొక్కెదను రమావర మన్నెముపల్లి కేశవా! ॥ (23)

ఉ॥ నాటకసూత్ర ధారివయి, నాదది, నీదది యన్నమాయచే
బూటకమైన నాట్యమున ముఖ్యము నీకగు లాభమేమి,నీ
యాటలకై వినోదముగ నాడుచు నుంటివి సృష్టికర్మ, నీ
వేటికి జేసితో యెరుగరెవ్వరు మన్నెముపల్లి కేశవా! ॥ (24)

ఉ॥ చూచెడివాడ వెవ్వరికి చూపులకందగ రానివాడ వో
యాచన జేయువాడ నినుయాచన జేయని భక్తకోటికిన్
దాచక నిచ్చువాడ కడుదాతవు నేతవు భూజనావళిన్
బ్రోచెడువాడ నిన్నుసరి బోలరు యెవ్వరు చెన్నకేశవా! ॥ (25)

ఉ॥ ఆపదలెన్ని వచ్చినను నార్తిగ నీ స్మరణంబు జేయుచున్
మీపద పద్మముల్విడక మిమ్ము భజించుచు బోయికృష్ణ,నా
ప్రాపుపు దాపు నీవెయని ప్రార్థనజేయు కుచేలు కివ్వవే
శ్రీపదవిమ్ము ముక్తునిగ జేయవె మన్నెముపల్లి కేశవా! ॥ (26)

ఉ॥ ఎప్పుడు మీపదాబ్జముల, నేమరక న్భజియించు చుంటి,నీ
విప్పుడె వచ్చి దర్శనమునిచ్చి హృదబ్జము నందునుండి న
న్నెప్పుడు వీడకయ్య మరణించెడు వేళను నీదునామమున్
దప్పక జ్ఞప్తి జేయవలె దాసుడ మన్నెము పల్లి కేశవా! ॥ (27)

శా॥ శాంతాకారుడు మేఘవర్ణుడును విశ్వాధారుడు న్నాదిమ
ధ్యాంతాభావుడు పద్మనాభుడును విద్యాప్రాభవో పేతుడున్
భ్రాంతార్తాఖిల జంతుపోషకుడు విప్రాద్యర్చనా ప్రీతుడే
కాంతుండాగమ శాస్త్ర మూలపురుషున్గాన్ జూతు నిన్కేశవా! ॥(28)

చ॥ అపకృతి జేయవెవ్వరికి యందరి లోపల నుందు నీవనే
ఎపుడు స్మరించు చుండెదను యిప్పుడె కావగరమ్ము వృద్ధుడన్
జపతపము వ్రతంబులును సాగవు బుద్ధిని నిల్వలేను, యే
కపటము లేమి నేనెరుగ గాంచుము మన్నెము పల్లి కేశవా! ॥ (29)

ఉ॥ తల్లివి దండ్రివి న్గురువు దైవము దాతవు నీవెసుమ్ము నా
యుల్లమునందు వెల్గుచును యుందువటంచును నిన్నెనమ్మి నే
నెల్లపుడున్ స్మరింతునిను యెప్పుడు దర్శన మిచ్చుచుండుమా
చల్లని దృష్టితోడ నను సాకుము మన్నెము పల్లి కేశవా! ॥ (30)

శా॥ అన్నానావర మిమ్మటంచు నొకనాడైనన్ రమావల్లభా
వున్నావెప్పుడు నాహృదబ్జమున, నేనున్నాను నీయాజ్ఞలో
ఎన్నాళ్లాయెనొ భక్తి నాకొసగితీ వింకేమి గావాలె, నా
కన్నీనీవని నిన్నె నమ్మితిని నీయంఘ్రి ద్వయిన్ కేశవా!॥ (31)

ఉ॥ కన్నుల జూడరానిదియు కర్ణములన్ కథలెన్నివిన్న నిం
కెన్నియొ సాధనంబులును యెప్పుడు వీడక చేయుచుండినన్
నిన్నెవరైన జూచెదర, నీప్రియ భక్తుల కన్న జూపవా
కన్నయ నీస్వరూ పమును గాంచెద మన్నెము పల్లి కేశవా!॥ (32)

ఉ॥ చక్కగ నాల్గు బాహువుల శంఖము చక్రము శార్ఙ్గమున్గదా
పక్కిని వాహనంబు గొని భక్తుల నార్తిని విన్న వెంటనే
యక్కడికేగి యాపదల నన్నిటి బాపు దయాసముద్ర, నా
దిక్కిటు జూడవయ్య గడుదీనుడ మన్నెము పల్లి కేశవా! ॥ (33)

ఉ॥ భక్తిగ సేవజేయు ప్రియభక్తుల మాకు లభింపజేయు మా
సక్తిగ నీదు కీర్తనలు శక్తి కొలందిగ సంత తమ్ముగా
రక్తిగ చేయుచుందు మనురాగము తోడుత బ్రోచువాడవై
ముక్తినొసంగు దాతవని మ్రొక్కెద మన్నెముపల్లి కేశవా! ॥ (34)

ఉ॥ పున్నమ నాటి చందురుడు బోలడు నీముఖ కాంతితోడ నీ
కున్న కిరీటి శోభలకు నొప్పవు నీడయి సూర్యరశ్మి నీ
యున్నతబాహులు న్నరమునుండురమన్ యరవింద నేత్రముల్
కన్నుల పండువుం గలుగ గాంచితి మన్నెము పల్లి కేశవా!॥ (35)

శా॥ ఎన్నోజన్మల పుణ్యసంచితమో నాకీజన్మ నీవిచ్చి నీ
వున్నావెప్పుడు వెంటనేతిరుగుచు న్నాత్సాహము న్జేయుచున్
నిన్నేనమ్మితి జన్మ నాకిడకుమా నీదాస దాసుండ నీ
కన్నన్ది క్కెవరయ్య భక్త వరదా! కళ్యాణ శ్రీ కేశవా! ॥ (36)

ఉ॥ ఆసభలోన ద్రౌపదికి నక్షయ వస్త్రము లీయలేదె నీ
కోసము దెచ్చి యాశబరి కోరిన పండ్లు భుజించలేదే,నీ
దాసుని దాసుడా గుహుడు తావక దాస్యమొసంగేదె,నీ
తోసరివారు లేరు కృపతోడుత గావుము చెన్నకేశవా! ॥ (37)

ఉ॥ చిత్తము నీపదాబ్జమున జేర్చి భజించెడి దాసకోటికిన్
వత్తునటంచు జెప్పకనె వచ్చియుదర్శన మిచ్చుచుండెదొ
యిత్తునటంచు జెప్పకనె యిత్తువు కోరకనున్న కోరికల్
ఉత్తమ పూరుషుండనగ నొప్పెడు మన్నెము పల్లి కేశవా! ॥ (38)

ఉ॥ ఒక్కడ వన్నిలోకముల నుండియు నేలుడటంచు వేదముల్
నిక్కము గాగ బల్కినవి నిత్యము సత్యము కల్ల లెట్లగున్
ఎక్కడ నుండువాడవొకొ యేమని పిల్చిన బల్కువాడవో
మక్కువ తోడజెప్పుమిక మావర మన్నెము పల్లి కేశవా! ॥ (39)

మ॥ భవబం ధంబులు వీడిపోవుటకు నీభక్తి ప్రసాదింపుమా
తవనామ స్మరణంబు జేయుదును నీదాస భృత్యుండ, నే
నెవరి న్వేడగ బోను నామనము నిన్నేమారక న్గొల్చుమా
ధవ! నీదేకద గాచుభార మెపుడున్ దామోదరా! కేశవా! ॥ (40)

మ॥ జగదా ధారుడ నీవె మాయవలన న్సర్వంబు సృష్టింప జే
యగ నీదేకద నాటకం బెపుడు నీయందుండు యీ జీవులే
పగిది న్మాయను దాటగా గలరు యా భారంబు నీదే కదా
దగుబుద్ధిన్ కృపజేసి ముక్తి నిడుమా ధర్మాత్మ యో కేశవా! ॥ (41)

మ॥ అభయం బివ్వవె వైరి తమ్ముడ పుడార్తి న్నిను న్వేడగా
శుభముల్జేతువు శత్రుమిత్రు లనక న్మద్ధాత్మ లౌవారికిన్
ప్రభుడౌ సర్వచరా చర ప్రకృతికిన్ ప్రార్థించిన న్జాలు నీ
వభయం బిచ్చియు మోక్షమిచ్చెదవు నిర్వ్యాజంబుగా కేశవా!॥ (42)

ఉ॥ వాసనలన్నియు న్విడచువాడయి భూతదయాళులైన, దా
దోసగుణంబు లన్వదలి దుష్టుల గూడక మానవాళికిన్
మోసములేవి జేయతను బుద్ధిని శ్రీహరియందు నిల్పి నీ
దాసుల దాసుగన్ గొనుమ దాతవు మన్నెముపల్లి కేశవా! ॥ (43)

ఉ॥ నాయురమందు మీదు చరణంబుల భక్తిగనిల్పి పూజలుం
జేయుచునుందు నెప్పుడును చిత్తము నిన్విడ నాడదయ్య, నా
మాయదొలంగ జేసినను మన్ననతోడుత సాకుమయ్య యీ
కాయము బోకముందెపుడు గన్పడు మన్నెముపల్లి కేశవా! ॥ (44)

శా॥ నీకైంకర్య మటంచు జేసితిని నే నిత్యాను సంధానమున్
నీకైంకర్యమె స్నాన,సంధ్య,జపముల్ లీపూజలు న్భోగముల్
నీకైంకర్యమె సర్వకర్మలెపుడు న్నిత్యోత్సవా లన్నియున్
నీకైంకర్య సమస్త కర్మ ఫలము ల్నిత్యంబులో కేశవా! ॥ (45)

చ॥ ఎరుగ ప్రవృత్తి ధర్మములు నేమినెరుంగని వృత్తిధర్మముల్
నిరతము నింద్రియమ్ములకు నీవధినాథుడ వౌటవల్ల.నీ
కరుణిను జేయుమన్న పనిగట్టిగ జేసిన నింద్రియమ్ములే
పరమదయాళు నీకృపకు పాత్రుడ మన్నెముపల్లి కేశవా! ॥ (46)

చ॥ ఉదయము నుండి రాత్రివరకొక్క పనైనను దప్పకుండగా
నిదురను స్వప్నకాలమున నీవె హృదబ్జమునందు సాక్షిగా
వదలక నుండి దుష్పథము వద్దని జీవుల నుద్ధరింపకన్
ముదమున నాటలాడుటిది మోదము గూర్చునె చెన్నకేశవా! ॥ (47)

మ॥ తనువున్విత్తము మానసేంద్రియముల న్దామోదరా! యిచ్చితిన్
మును నేజేసిన కర్మల న్దలపక న్ముక్తి న్ప్రసా దింపుమా!
అనుమానించకు నీకునేను శరణమ్మంటి న్దయన్జూడుమా
ఘనమోహాబ్ధి తరింపజేయు మిపుడే కంజోదరా! కేశవా! ॥ (48)

మ॥ పరకాన్తను గన తల్లిగా కనెడి సద్భావంబు గల్గించుమా!
పరవిత్తంబది నాకురావలెననే భ్రాన్తిందొొలం గించుమా!
పరసౌఖ్యంబులు జూచినోర్పు గలిగేభావంబు సంధించుమా!
పరమాత్మా! నిను నమ్మియుంటి యెపుడు న్భక్తుండనో కేశవా! ॥(49)

ఉ॥ మానవ జన్మనిచ్చితివి మంచిదె! జన్మదరించు మార్గమే
నేను భవాబ్ధిలో మునిగి నిన్ను భజించగ రావదేమయో?
దీనజనావనా! యిపుడు దిక్కెవరయ్య? దరింపజేయ నీ
వే నను బ్రోవకున్న మరివేరెవరీ యిల? చెన్నకేశవా! ॥ (50)

ఉ॥ చిన్నతనంబునన్ ధృవుడు చిత్తమునిల్పి దపంబు జేసి, తా
నన్నివిధాల గోరగను నాధృవ మండల మిచ్చితీవు ని
న్నెన్నడు కోర్కెలేమడుగ యిప్పుడె జన్మదరింప జేయుమో
పన్నగశాయి! విశ్వపరి పాలక మన్నెము పల్లి కేశవా! ॥ (51)

చ॥ మనమున నిల్పినిశ్చల సమాధిని శ్రీహరినిన్ స్మరించినన్
ఘనమగు మోక్షమబ్బు, నదిగాక మరేమియు లేదుపాయమున్
వినుమని జెప్పెమా గురువు, వీలగునంతయు శ్రద్ధజేసితిన్
మనమును నిల్పలేదనక మన్నన తోడుత జూడు కేశవా! ॥ (52)

ఉ॥ భక్తులలోన నీకుప్రియ భక్తుడు రాజగు నంబరీషుడా
సక్తిగ ద్వాదశీవ్రతము చాలగ భక్తిగ జేయు చుండగా
శక్తినిబంపె తాపసుడు చక్రముతోనుప సంహరింపవా
భక్తుల బాధబాప గలవాడవు మన్నెము పల్లి కేశవా! ॥ (53)

చ॥ విదురుడు ప్రేమతోబిలిచి చిందులుజేసెను నీదుభక్తితో
ముదమున నారగించితి విముక్తి నొసంగితి వట్లుజేయగా
కుదురునె? నీకునియ్య దగినట్టిది నాహృదయాబ్జ మిచ్చితిన్
సదయుడవై గ్రహించి నను జక్కగ నేలుము చెన్నకేశవా! ॥ (54)

ఉ॥ శంతను పుత్రుపైన ననిశంబును జూపినయట్టి ప్రేమ,ర
వ్వంతయు జూపినన్ను భవవార్ధిని దాటగ జేయవేలనే
నెంతటివాడ నీమహిమలెన్నని సంస్తుతి జేయువాడ, నా
చింతలుబాపి ముక్తినిడు శ్రీధర! మన్నెము పల్లి కేశవా! ॥ (55)

శా॥ భావంబందున యెప్పుడున్మరువ నా ప్రహ్లాదు భక్తాగ్రణిన్
దేవాంశమ్మున బుట్టినాడు హరియందే కాగ్రచిత్తుండు, స
ద్భావంబు న్గలవాడు ధీరుడును నిష్పాపుండ హింసారతిన్
సేవింతున్ హరిభక్తి పూజితుకు నాచిత్తంబు లో కేశవా! ॥ (56)

చ॥ వనమున శాపకారణము వల్లను నాతియు రాయియౌటచే
పనిబడి వచ్చి ద్రొక్కినను పాదములంట నహల్యయయ్యె నా
మునిసతి పూజలన్గొనుచు మోదమునందితి గాదె నిన్ను నా
మనమున దల్తు నెప్పుడు రమావర మన్నెము పల్లి కేశవా! ॥ (57)

ఉ॥ పాండవ మాత కుంతియును భక్తిగ జేరిట వేడె, నో
పాండవపక్ష నిన్ను నెడబాయని భక్తి నొసంగుమన్న నీ
యండను బాయకుండనని యంటివి నీవభయం బొసగితీ
నిండుదయా సముద్రుడవు నీవలె యెవ్వరు లేరు కేశవా! ॥ (58)

శా॥ ఆయక్రూరుడు నిన్నుజూపు మనినాడా? విశ్వరూపమ్ము నీ
దాయాదుండని నీకు భక్తుడని సత్తాతోడ జూపించి నా
వో? యీదాసుని కేల జూపవది నీకుత్సాహ మున్లేకనా
నేయాచించితి నీకు మ్రొక్కితిని గానీ జూపవా కేశవా! ॥ (59)

ఉ॥ పార్థుడు నీకుశిష్యుడును బావమరిందియు నౌటచేత సం
ప్రార్థన జేయుచుండె కడుభక్తిగ గీతను జెప్పితీవు నన్
వ్యర్థము జేయకయ్య సమభావుడ వైతివ, పార్థురీతి,వి
ద్యార్థిని నన్ను గాంచమని యంజలిజేసితి చెన్నకేశవా! ॥ (60)

శా॥ ప్రారబ్ధంబును దీరగా వలెననే భావంబు లోకోక్తి నా
భారమ్మంతయు నీదెగావునను నీభక్తుండ నీకింకరున్
వేరాలోచన లేమి జేయనెపుడున్ వెన్వెంటనే యుండినా
ప్రారబ్ధంబును బాపు నీదుదయతో భక్తప్రియా! కేశవా! ॥ (61)

శా॥ నాహృత్పద్మము నందునుం డియును నానాథుండ వున్నీవయై
దేహమ్మందున నింద్రియ మ్ములకు నీ తేజంబు జూపంగనే
మోహమ్మందును సర్వకర్మ ములవే ముమ్మాటికిం జేసె, యా
దేహ భ్రాంతుని కంటు కర్మములనే దేహమ్ముగా న్కేశవా!॥ (62)

ఉ॥ శ్రీపతి నేను పాపములు జేసిన వెన్నియొ లెక్కలేదు యే
పాపములింక జేయనని పాదము లన్శరణంబు వేడితిన్
తాపము లన్నిబాపు వరదా! భవబంధము లూడ జేసియున్
జూపుము నీదు రూపమును జూసెద మన్నెము పల్లి కేశవా! ॥(63)

శా॥ నీపాదంబుల మ్రొక్కునట్లు శిరము నిన్జూచు నేత్రంబులున్
నీపాటల్వీను కర్ణము ల్మనములో నీధ్యానము న్జేయుచున్
నీపద్యం బులు నాల్కబాడు నటుల న్నీపూజకు న్హస్తముల్
నీపేరు న్స్మరియింపు బుద్ధినిడుమా! నీవాడరా! కేశవా! ॥ (64)

శా॥ సర్వాధారుడవై ప్రపంచ మునకు న్సాక్షి స్వరూపుండవై
సర్వాత్ముండవు నీవసర్వము ప్రకాశ మ్మొందగా జేయుచున్
సర్వాకారు డవయ్యి దేనికిని కాసంతైన నీవం టకన్
సర్వాధ్యక్షత నొంది నేలితివి యిచ్ఛాలీలమై కేశవా! ॥ (65)

శా॥ సాక్షాత్కార మొసంగు నాకునిపుడే సాకార రూపంబుతో
యీక్షేత్రమ్మున నుండి నీకుదయ రాదేమందు నీవెప్పుడు
న్సాక్షేమంబును గోరువాడవు గదా నన్నేయుపేక్షింతువా?
దీక్షాకంకణ ధారి నీవెగతిరా! దీనుండరా! కేశవా! ॥ (66)

శా॥ ఓంకారమ్ము కతీత రూపముననే యున్నావు నిన్బోలగా
నింకా వేరెవరు న్నరయ్య భువిలో యిచ్ఛావిహారంబు, కా
టంకం బేమియు లేకనాడుకొను నాటల్నీకు యీసృష్టి నీ
కైంకర్యమ్మును జేతు నాకునిపుడే గన్పింపుమా కేశవా! ॥ (67)

చ॥ నరహరి నిన్నువే డెదను నమ్మితి నీచరణ ద్వయంబునన్
నరమర సేయకయ్య శరణంటిని నామొఱ నాలకించరా
వరమున వెంట నుండుమని ప్రార్థన జేసితి నీకు మ్రొక్కితిన్
వరముల గోర నాహృదయ పద్మము నుండుము చెన్నకేశవా!॥(68)

ఉ॥ మోక్షము నిచ్చుదాతవని మ్రొక్కితి నమ్మికతోడ నుంటి నే
దీక్షలుబూని భక్తిగను తీవ్ర జపంబులు జేయ లేనయా
సాక్షిగనుండి జూచితివి సర్వమునా హృదయమ్ము నుండి నీ
దీక్షయె భక్త రక్షణము దీనుడ నేలుము చెన్న కేశవా! ॥ (69)

ఉ॥ నామసుధా రసంబెపుడు నారద మౌనియు గ్రోలుచుండు నీ
నామసు ధారసంబు మునినాథుడు కౌశిక మౌని గ్రోలెయా
నామసుధా రసంబు రసనంబున గ్రోలె మహేశ్వరుండు నీ
నామము వ్రాయునాడు రసనంబును గ్రోలెద చెన్నకేశవా! ॥ (70)

ఉ॥ రాజులకెల్ల నీవ యధిరాజువి నీ శరణంబు వేడితిన్
నాజనకుండ వెప్పుడును నాయరిషట్కము బాధబాపుమా
యీజగమందు నీకుసరి యెవ్వరు లేరని వేడుకొంటి య
వ్యాజ కటాక్ష పూర్ణుడ వపార కృపానిధి చెన్న కేశవా! ॥ (71)

మ॥ యదువంశోద్భవ! కృష్ణ! నీవెగతి నీయంఘ్రిద్వయి న్నమ్మితిన్
సదయాత్ముండ వటంచు వేడితిని నీసందర్శ నంబిచ్చి నా
హృదయాబ్జ మ్ముననుండు నీదుదయతో హే రుక్మిణీనాథ నా
కదెజాలు న్పదివేల దండములు శ్రీకాంతా ప్రభూ కేశవా! ॥ (72)

చ॥ గణనాథుండవు నీవె రుద్రగణముల్ గంగాధరుండీవె యా
ప్రణవాకారము నీవె విష్ణుడవు యాబ్రహ్మాదులు నీవె యా
ఫణినాథుండవు నీవె నేనుమదిలో భావింప యీవిశ్వము
న్నణురూపంబున నుండువంతటను లేవాద్యంతము ల్కేశవా!॥ (73)

మ॥ యమలో కంబును బోదు మానవుడు నీయందే మనస్సుంచిన
న్వముండై భవబంధ ముక్తుడగుచు న్విజ్ఞానము న్పొంది, కా
మము, క్రోధంబును,లోభ,మోహ, మదమున్, మాత్సర్యముల్లేక,నే
భ్రమలం జెందక నిన్ను జేరెదరు నీ భక్తుల్సదా కేశవా! ॥ (74)

## -: దశావతారములు :-

చ॥ శృతులనుదొంగిలించినిట, శీఘ్రమువారిధిజొచ్చి సోమకున్
హతమొనరించి వేదములు హర్షము తోడుత బ్రహ్మకిచ్చినన్
సతతము సృష్టి జేయుచును సంతసమందదె నీప్రతాపమున్
శతమఖ రుద్రులు న్దెలియ జాలరు మన్నెము పల్లి కేశవా! ॥ (75)

ఉ॥ కూర్మమ వయ్యి మంధరము గ్రుంగగ వీపున మీదకెత్త స
ద్ధర్మము జూచి దేవతలు రాక్షసులు న్మదియింప బుట్టినా
నిర్మలమైన నాసుధను నీవె గ్రహించియు దేవతాళికిన్
మర్మమెరింగి పోసితివి మాధవ! మన్నెము పల్లి కేశవా! ॥ (76)

ఉ॥ సూకరమయ్యి యీధరను బట్టిన దానవు నిన్వధించి,ను
ద్రేకముతోడ యీ పృథివి దేవినినెత్తి జలంబుపైన, ప్ర
త్యేకముగాను నిల్పితివదేకద సృష్టికి మూలమయ్యె గా
దే, కరుణించి బ్రోవునను దీనుడ మన్నెము పల్లి కేశవా! ॥ (77)

మ॥ హరినీవే నరసింహ రూపమున ప్రహ్లాదున్ కృపన్గావ భీ
కరమౌ నాకృతిచే హిరణ్యకశిపున్ ఖండింపగా జేసి భూ
భరమున్బాపగ భక్తవత్సలుడుగా ప్రఖ్యాతిని న్గాంచితో
పరమాత్మా ననుబ్రోవ నీకుబరువా? భక్తార్చితా కేశవా! ॥ (78)

ఉ॥ వామన రూపుడయ్యు బలివద్దకు నేగియు మూడుపాదముల్
భూమిని భిక్షమి మ్మనిన మోదముతో నిడి కొల్చు కొమ్మనన్
భూమి,నభంబు రెండుగను మూడవపాదము నందడించి నా
కమ్మును దేవతా ళికిని గ్రన్నన నిచ్చిన చెన్న కేశవా! ॥ (79)

చ॥ పరశు ధరించి రాజులను భండన మందున సంహరించినా
నిరువది నొక్కమారు గణియించుచు భార్గవరామ తండ్రికిన్
బరువడి తర్పణం బిడిన పంచ శమంతక తీర్థ రాజమా!
సరసుల స్నాన మాడినను సద్గతి నిత్తువు చెన్న కేశవా! ॥ (80)

ఉ॥ శ్రీరఘురామ నీమహిమ చిత్రము రావణు సంహరించి, భూ
భారము వాపి రాజ్యమును పాలన జేయుచు మానవాళిచే
నారయ ధర్మమార్గమును నందరి నిన్నడిపించి మోక్షము
న్వారికొ సంగినావు సులభంబుగ మన్నెము పల్లి కేశవా! ॥ (81)

చ॥ జగమున రామకృష్ణులన జన్మమునొందియు దుష్టరాజులన్
పగగొని సంహరిం చుచును పార్థునిచే కురువంశ మంతయున్
దగనశి యింప జేసియును ధర్మము స్థాపన జేసినావు, నో
నిగమ సుపూజ్య నాకొసగు నీ చరణమ్ముల సేవ కేశవా! ॥ (82)

ఉ॥ బుద్ధుడవయ్యి ధర్మములు బోధన జేయుచు ధర్మమార్గ సం
సిద్ధుల జేసినావు నిను చింతన జేయగ భక్తి తోడ స
ద్బుద్ధులుగల్గి నెల్లెడల పుణ్యము కర్మములన్ని జేయుచున్
బద్ధులు గారు మీచరణ భక్తులు ముక్తులె చెన్న కేశవా! ॥ (83)

ఉ॥ శంబల గ్రామ సద్విజుని సాధ్వికి కల్కి జపించినంతనే
సంబరమందు చుందురని శంబునుకల్కియు వాజినెక్కుచున్
దంబము జూపురాజుల వధంబొన రించుచు నిల్పు ధర్మమున్
యంబుజ నాభ యామహిమ లద్భుతమౌ గద చెన్న కేశవా!॥(84)

ఉ॥ ఈపది పద్యముల్జదివి యేమియు గోరకనున్న నిచ్చె దౌ
దాపునవచ్చి చేరుచును తాపము లన్నియు బాపుచుండె దౌ
శ్రీపతి నీదెభారమన చెంగున దుంకుచు వెంటనుండె దౌ
నీపద పద్మముల్ విడువ నేవిడువ న్నిరతంబు కేశవా! ॥ (85)

ఉ॥ బంధులు పుత్రమిత్రులును భార్య గృహంబును నేననాథనే
బంధములోన చిక్కుబడి బాధల నొందుచునుంటి నోదయా
సింధుపరాత్పరా! వినుతి జేసితి వేగమె రాగదయ్య! నా
బంధవిముక్తి జేయగల భారము నీయదె చెన్న కేశవా!॥ (86)

ఉ॥ ఏమని బిల్వవచ్చెదనొ యెక్కడనుంటివొ నెట్లువత్తువో
వోమహనీయ దెల్పుమిక వూరక తిప్పలు బెట్టకయ్య నీ
నామము నేస్మరించుచు మనంబుల నర్పణ జేసికొంటి యిం
కేమియు జేయుమన్న సరె నిప్పుడె జేసెద చెన్న కేశవా!॥ (87)

ఉ॥ చిక్కవు నీవు యెవ్వరికి చిక్కక చిక్కక చిక్కినావు నీ
చక్కనిరూపు జూచితిని జప్పునకన్నులు మూసివైచితిన్
యెక్కడ నిన్నువీడెదను యిప్పుడె నాయెదనిల్పి యెప్పుడున్
మ్రొక్కుచు మోదమందెదను మోక్షము నాకదె చెన్నకేశవా! ॥ (88)

ఉ॥ నావెనువెంట నెప్పుడును నన్విడనాడక దిర్గుచుండినన్
దేవ నెరుంగనైతి నినుదీరని మోహభవాబ్ధి జిక్కి నీ
సేవను జేయనైతిపుడు శ్రీపతి దర్శనమిచ్చి తేని నా
భావవిశుద్ధి చేతభవ బంధము లూడును చెన్న కేశవా! ॥ (89)

ఉ॥ జీవులకెల్ల దల్లివగు శ్రీరమ నామొర లాలకించు మీ
సేవక దాసదాసునకు శీఘ్రము దర్శన మిమ్మటంచు నీ
వేవిభుతోడ దెల్పు మురిపించుచు ప్రేమరసంబు లొల్కగా
దేవి నమస్కరించెదను దీనుని గావగ రావె యిందిరా! ॥ (90)

ఉ॥ పుట్టితి నీకటాక్షమున బుట్టిన భక్తిని వృద్ధిజేయ చే
పట్టితివీవు గట్టిగను బట్టుప్రతిజ్ఞను నిల్పుకొమ్ము నే
బట్టితి నీపదాబ్జములు బట్టియు వీడగ లేనికెప్పుడున్
పుట్టియు చావులేనిదగు ముక్తినొసంగుము చెన్నకేశవా! ॥ (92)

మ॥ తనవర్ణా శ్రమ ధర్మముల్విడక సంధ్యావందనాది క్రియల్
మనమున్నిల్పుచు శ్రద్ధతోడుతను కర్మంబుల్సదా జేయుచు
న్ననుమా నించక సర్వకర్మముల నీకర్పించ మోక్షార్హుడే
యనికైవల్య మొసంగు దాతవు గదయ్యా! మాధవా! కేశవా! ॥ (92)

ఉ॥ ఆదిని కేశవా! యనుచు నాచమనంబును జేసి కర్మము
ల్మోదము తోడజేసి ననుపూర్ణ ఫలంబుల నిచ్చుచుండె దౌ
నీదయచేత భక్తులకు నిత్య సుఖంబులు గల్గుసత్ప్రభూ
నీదరి జేర్చుకొమ్ము కరుణించుము దాసుని చెన్నకేశవా! ॥ (93)

శా॥ ఉన్నావా! నినుజూతు నంచుమదిలో నుత్సాహ ముంజెంది నే
నున్నానిప్పుడు పూర్వజన్మ సుకృతంబు న్నట్లుగా దోచె నే
నెన్నాళ్లాయెనొ యత్నము ల్సలుపగా యీవేళ గన్పించి నీ
వున్నాకన్నుల లోననిల్వు సతతంబు ప్రేమతో కేశవా! ॥ (94)

చ॥ మనమును నేనుగాదెపుడు మాయ మనస్సును జూచువాడ చే
తనుడను సాక్షిమాత్రుడను దానిచలించుట నాకుబంధమా
యినుడును సృష్టికర్మముల యేమిటి కంటక ముండునట్లు నా
కనవరతంబు కర్మముల నంటని వాడిగ జేయు కేశవా! ॥ (95)

ఉ॥ ఎన్నియుగాల నుండి మనమిద్దరమే కదనీదు వెల్గుతో
నన్నివిధాల కర్మముల నాటల నాడగ జేసి తీవు నీ
వెన్నడు మాటలాడితివ, యీపని చెడ్డది చేయవద్దు, నీ
వన్నియుమంచి జేయుమని యంటివ మన్నెము పల్లికేశవా! ॥ (96)

ఉ॥ ఏమియు జెప్పకుండుటను యీపని మంచిది చెడ్డదంచు నే
నేమియు గుర్తెరుంగకయె యెన్నియొ జేసితి పుణ్యపాపముల్
వోమహనీయ దప్పులును వొప్పుల కన్నియు నీదె భారమో
స్వామి భవాంఘ్రి పద్మముల సన్నిధి జేరితి చెన్నకేశవా! ॥ (97)

ఉ॥ ఎందుకు మాటలా డవొకొ యేమప రాధము జేసియుంటినో
విందులు జేయలేదనియొ విద్యలెరుంగని మూఢుడే యనో
ముందర నున్నడా యనియొ ముక్తిని గోరెడువాడు వీడనో
యందరి తీరుగాదనియె యందువొ మన్నెము పల్లికేశవా! ॥ (98)

శా॥ నీవీమౌనము దీక్షనుండుటను నేనేబాగ గుర్తించితిన్
నీవే మాటలనాడి నావనినవే నేనిన్ను బాధించనా
నీవీయుక్తిని బన్నినావు సరిగా నీవేమాగతిం జూడవా
నీవాత్సల్యత నెట్లుదాచు కొనెదో నీయిష్టమే కేశవా! ॥ (99)

శా॥ నీవాపార్థుని తోడబల్కితివి గానీ నిల్పుకున్నావటే?
నీవాయుద్ధము జేయ నాయుధముల న్నేబట్ట నంచంటివీ
నీవే భీష్ము జయింప చక్రము వెసన్నీచేత నేబట్టవే
నీవీమౌనము మాటకట్టునకు తండ్రిందాల్చితో కేశవా! ॥ (100)

శా॥ నీవేదిక్కని నిన్ను నమ్మితినయా! నీవేల మాటాడవో?
నీవీ మౌనపు దీక్షనే విడువవా? నేనేమి జేయాలిరా!
నీవేనాకభయం బొసంగెదనియే నేనాస పడ్డానురా!
రావా! దాసుని గావ నీకుదయయే రాదా? ప్రభూకేశవా!॥ (101)

ఉ॥ గట్టిగ విన్నవించితిని కర్తవు నాకెపుడైన నీవె నన్
గట్టిగ బట్టుకొంటి భవకానన మున్పడకుండ జేసి,చే
పట్టినవాడవీవు హరిభక్త ప్రియుండవు నిన్నుజేర్చుకొ
మ్మెట్టులనైన జేసి జగదీశ్వర మన్నెము పల్లి కేశవా! ॥ (102)

ఉ॥ అన్నివిధాల నాకొరకు నాప్తునిరీతిగ వెంటనుండుచున్
యెన్నడు నేమికష్టముల నియ్యక ప్రేమగ జూచుచుంటి వో
కన్నయనేను నీకు నుపకారము జేయగలేను నీవె న
న్గన్నటువంటి తండ్రివని కాళ్ళకు మ్రొక్కెద చెన్న కేశవా!॥ (103)

ఉ॥ సన్నుతి జేయలేమనిరి శంకర, నారద, బ్రహ్మ వేదముల్
నిన్నునుతించ నాతరమ? నీ చరణంబుల మ్రొక్కు కింకరున్
మన్ననజేసి మీరె యనుమానము జేయక వెంటనుంచుకో
నన్ను కృతార్థు జేయుమని నమ్మితి మన్నెము పల్లి కేశవా! ॥ (104)

ఉ॥ అందరియందు నీవె గలవందురు యెందరొ యిందిరాప్రభూ!
ముందర వెన్క సందులను మొత్తము క్రిందను మీదనుందు గో
విందా! ముకుంద! కృష్ణ! యరవింద! మనోహర! నందనందనా!
వందన మందుకొమ్ము సురవందిత మన్నెము పల్లి కేవవా! ॥(105)

ఉ॥ అంతము లేనివాడవు యనంతుడ వంతట నున్నవాడ శ్రీ
కాంతుడ వప్రమేయుడవు కారణభూతుడ వాదిశేషుడౌ
స్వంతము లేనివాడ వనిశంబును భక్తులనేలువాడ వి
ద్యాంతమెరుంగు వాడవు చిదాత్మవు మన్నెముపల్లి కేశవా! ॥ (106)

ఉ॥ భాగవతోత్త మార్చనలు భక్తిగసల్పిన మానవాళికిన్
రాగములు న్నశించును రంగనిభక్తియు గల్గి వెంటనే
భోగము లాశలున్నుడుగ ముక్తి పథంబున కర్హుడే గదా
జాగొనరింప నేలయిక సద్గతినీయవె చెన్నకేశవా! ॥ (107)

శా॥ ఈయంత:కరణంబు నిచ్చినది నాకీవే గదా మాధవా!
ఛాయన్నన్ గనరాని మాయమనము న్చాంచల్యముం జెందగా
నీయంఘ్రి ద్వయమందు నాదుమనమున్ నేనిల్పంగ లేనెప్పుడున్
మాయంద్రోసియు నిల్పు నాదుమనము న్మానాయకా కేశవా!॥(108)

శా॥ నాకీదేహము బోకముందు నిపుడే నాలోన గన్పించరా!
నాకాకాల మెరుంగరాదు యెపుడు న్నావెంటనే యుండరా!
సాకేధాతిప జేర్చుకొమ్ము ననునీ సచ్చిత్ర్ప కాశంబులో
నీకున్ మ్రొక్కెద నిన్నెనమ్మితి సదా నీభారమే కేశవా! ॥ (109)

శా॥ కల్యాదిన్గత మైదువేలపయి సంఖ్యా డెబ్బదీ యెన్మిదిన్
కళ్యాణాత్మకమైన మీశతకముల్ గావ్రాసితి న్లోకముల్
కళ్యాణంబులు గాగజేయు దయతో కంజోదరా! జన్మసా
ఫల్యమ్మొందగ జేయునన్ను వరదా! భక్తప్రియా! కేశవా! ॥ (110)

ఉ॥ రంగడవై హృదబ్జమున రంజిలి కేశవస్వామి పద్యముల్
పింగళి వత్సరంబునను ప్రేరణ జేసితి నీవె బుద్ధితో
పొంగుచు జెప్పివృత్తముల పువ్వులు నూటికిపైన మాలతో
మంగళరూప యీకృతి సమర్పణ జేసితి గొమ్ము కేశవా! ॥ (111)

ఉ॥ మంగళముల్ శ్రియ:పతికి! మంగళముల్ వకుళాప్రియాత్మకా!
మంగళముల్ పురారినుత! మంగళముల్ భవబందమోచకా!
మంగళముల్ ధరాధిపతి! మంగళముల్ కమలామనోహరా!
మంగళముల్ మహేంద్రనుత! మంగళముల్ గొను చెన్నకేశవా! ॥ (112)

ఉ॥ నీశతకమ్ము భక్తిగను నేపఠియించితి నన్నుబ్రోవుమో
కేశవస్వామి నాహృదయ కేద్రమునందున నెప్పుడుండి నా
యాశయమెల్ల గుర్తెరిగి యాపదలన్నియు బాపుచుందు ని
న్నేశరణంబు వేడితిని నీదుస్వరూపము జూపు కేశవా! ॥ (113)

ఉ॥ రాముని దాస దాసులము గ్రామము మన్నెముపల్లి వాసమున్
రామక రామశర్మ సతి రామణ కమ్మయు తల్లి గుండమా
ప్రేమగజూచు సూరయను పేరును తండ్రియు నత్రిగోత్రమున్
రాముడనంగ నీవెయను రాగము తోడుత బ్రోవు కేశవా! ॥ (114)

ఉ॥ మన్నెముపల్లి వాసులగు మానవులందరి వేరువేరుగా
నన్నికులాల వారికిని యాదొరలాది పటేండ్లు కాపులున్
పన్నుగ వైశ్యవిప్రులు నపాంగులు గౌడులు విశ్వబ్రాహ్మణుల్
యెన్నగ పద్మశాలురును యెరగ్రిగొల్లలు మేరవారలున్
నున్నరు నాపకుల్ హరిజనుల్ రజకుల్ దగశాలివాహనుల్
మన్నన జూడుమర్చుకుని మానుగ బెస్తలు ముత్తరాశులున్
మన్నెపువాంఢ్రు మాలలును మంత్రపు వైద్యము జేయువారలున్
పన్నగశాయి వీరికిని భక్తియు నాయువు ధాన్యసంపదల్
నన్నియు నిచ్చి బ్రోవుమని యంజలి బట్టితి చెన్నకేశవా! ॥ (115)

ఉ॥ ఎప్పుడు వానకాలమున యిచ్చటి కుంటలు చెర్లు బావులున్
తప్పక నిండగావలయు దాతవు దైవము దీనరక్షకా
యప్పులు లేక నందరికి నన్నియు పంటల నిచ్చి వీరినె
ల్లప్పుడు బ్రోవుమంచు కమలాపతి మ్రొక్కెద చెన్నకేశవా! ॥ (116)

*****

-: శ్రీలక్ష్మీ చెన్నకేశవస్వామి చరణారవిందార్పణమస్తు :-